TELUGU DIALECT BULLETIN SERIES-8

# తెలుగు మాండలికాలు

## కర్నూలు జిల్లా

సంపాదకుడు
డా॥ బూదరాజు రాధాకృష్ణ




తెలుగు అకాడమి
హైదరాబాదు
1984

# సంపాదకీయం

తెలుగు అకాడమి ప్రచురిస్తున్న తెలుగు మాండలిక పదకోశ పరంపరలో ఇది ఎనిమిదో గ్రంథం. ఇంతకు ముందు కరీంనగర్ (1971), కడప, విశాఖ, గుంటూరు (1972), వరంగల్లు (1977), చిత్తూరు (1983), శ్రీకాకుళం (1984) మాండలికాలు వెలుగు చూశాయి. ఇవిగాక అనంతపురం ఆదిలాబాద్, నిజామాబాద్ మాండలికాలు అచ్చులో ఉన్నాయి. ఇప్పటికి కళింగ, రాయలసీమ ప్రాంతాల్లో పర్యటన పరిశోధన పూర్తి అయింది.

కర్నూలు జిల్లాలో పర్యటన పరిశోధన 1982లో మొదలై ఆయేడే ముగిసింది. మరుసటి సంవత్సరానికే సిద్ధమైన ముద్రణయోగ్యప్రతి [illegible] ఇప్పుడు అచ్చయింది. పర్యటనపరిశోధన పూర్తిగా చేసి ఈ గ్రంథంలోని ప్రధాన భాగమంతా సిద్ధం చేసినవారు శ్రీ కె రమేశ్ కుమార్. ఇందులో శ్రీకాకుళం కర్నూలు మాండలిక వ్యవహారాలను తులనాత్మకంగా పరిశీలిస్తూ వ్యాసం రాసినవారు కుమారి ఉపాసన్నాల. వీరిద్దరికీ మా ధన్యవాదాలు.

ఈ గ్రంథంలో మాండలికపటం గీసిన చిత్రకారుడు శ్రీ బి ఎ. పింగ్లే. ముద్రించినవారు ప్రోగ్రెసివ్ ప్రెస్ ప్రింటర్స్. వీరికి మా కృతజ్ఞతలు.

# విషయ సూచిక

# 1

# కర్నూలు జిల్లా

కర్నూలు జిల్లా ఆంధ్రప్రదేశ్‌లో దక్షిణ భాగాన ఉన్నది. ఈ జిల్లా ఉత్తర అక్షాంశం 14°54' నుంచి 16°18' వరకు, తూర్పు రేఖాంశం 76°58' నుంచి 79°34' వరకు వ్యాపించి ఉంది. దీని వైశాల్యం 17,658 చదరపు కిలోమీటర్లు. ఆంధ్రప్రదేశ్ లోని జిల్లాల్లో వైశాల్యం రీత్యా రెండవ స్థానాన్ని ఆక్రమించింది. ఈ జిల్లాకు ఉత్తరాన మహబూబ్‌నగర్ జిల్లా, దక్షిణాన అనంతపురం, కడపజిల్లాలు, తూర్పున ప్రకాశం జిల్లా, పశ్చిమాన కర్ణాటక రాష్ట్రం సరిహద్దులుగా ఉన్నాయి. ఈ జిల్లా నుంచి మార్కాపురం, గిద్దలూరు తాలూకాలను విడదీసి ప్రకాశం జిల్లాలో 1972 ఫిబ్రవరి రెండవ తేదీన కలిపినారు.

కర్నూలు పట్టణ మూలంగా ఈ జిల్లాకు కర్నూలు జిల్లా అని పేరు వచ్చింది. కర్నూలు జిల్లాకు దగ్గరలో ఉన్న మహబూబ్‌నగర్ జిల్లాలోని ఆలంపుర దేవాలయం కట్టడానికి రాళ్ళు తోలే బండ్లవారు, ఇతర ప్రాంతాలకు వెళ్ళే బండ్లవారు వారి బండ్లను ఇక్కడ ఆపి, ఇక్కడ దొరికే గానుగ నూనెతో బండ్లకు కందెన వేసుకునే వారని, అందువలన ఈ ప్రాంతానికి 'కందెనవోలు' అనే పేరు వచ్చిందని, కాలక్రమాన అది 'కందనూలై' వ్యవహారంలో కర్నూలుగా మారిందని ప్రతీతి. ఈ జిల్లాలో పన్నెండు తాలూకాలున్నాయి. అవి : ఆదోని, ఆళ్ళగడ్డ, ఆలూరు, ఆత్మకూరు, బనగానపల్లి, దోన్, కోయిలకుంట్ల, కర్నూలు, నందికొట్కూరు, నంద్యాల, పత్తికొండ, కోడుమూరు.

ఈ జిల్లా రాజకీయ చరిత్రకు చాలా ప్రాముఖ్యం ఉన్నది. విభిన్న కాలాల్లో, విభిన్న రాజ వంశస్థులు ఈ ప్రాంతాన్ని పరిపాలించినారు. వారిలో ముఖ్యులు, నందులు, మౌర్యులు, శాతవాహనులు, పల్లవులు, బాదామిచాళుక్యులు, రాష్ట్రకూటులు, కళ్యాణి చాళుక్యులు, యాదవులు, కాకతీయులు, విజయనగర రాజులు, బహమనులు, బిజాపూర్ అదిల్ షాహీలు, గోల్కొండ కుతుబ్ షాహీలు, మొగలులు, ఆసఫ్ జాహీలు, ప్రాంతీయ పాలకులైన నలవంశస్థులు, బదినేపల్లి తెలుగుచోళులు, వెలనాటి చోళులు, కాయస్థులు, వెలుగోడు ప్రధానాధికారులు, అవుకు ప్రధానాధికారులు, కందెనవోలు ప్రధానాధికారులు కర్నూలు నవాబులు, బనగానపల్లి నవాబులు మొ॥ వారు ఈ ప్రాంతాన్ని పరిపాలించి నారు.

ఈ ప్రాంతం క్రీ. శ. 8వ శతాబ్దంలో పశ్చిమ చాళుక్య రాజ్యాంతర్భాగమైంది. కాకతీయ రాజులలో మొదటివాడైన ప్రతాపరుద్రుడు క్రీ. శ. 1162లో ఈ ప్రాంతాన్ని శ్రీశైలం వరకు ఆక్రమించాడు. కర్నూలు జిల్లా కాకతీయ సామ్రాజ్యంలో, కాకతీయ గణపతి దేవుని కాలంలో కలిసిపోయింది. వీరి కాలంలోనే ఈ జిల్లాలోని నల్లమల అడవులను కొంత వరకు నరికించి గ్రామాలను తయారు చేసినారు. రుద్రవరం మొదలైన పేర్లున్న గ్రామాలు కాకతీయుల కాలంలో నిర్మించబడ్డవని చెప్పుటకు ఆధారాలు. కాకతీయ సామ్రాజ్య పతనానంతరం, ఈ ప్రాంతం ఢిల్లీ సుల్తానుల వశమైంది. 1525 సం॥లో ఈ జిల్లా కృష్ణదేవరాయల పరిపాలనలోకి వచ్చింది. విజయనగర సామ్రాజ్యం తళ్ళికోట యుద్ధంతో పతనమై, కర్నూలు జిల్లా గోల్కొండ, బిజాపూరు నవాబుల పాలనలోకి వచ్చింది. 1664లో గోల్కొండ ప్రభువులు ఈ జిల్లాలోని తూర్పు భాగాన్ని, బిజాపూరు సుల్తాను పడమటి భాగాన్ని వశపర్చుకున్నారు. గోల్కొండ, బిజాపూరు నవాబుల పాలన 1687లో అంతరించటంతో మొగలాయి సామ్రాజ్యంలోకి వచ్చింది. వీరి కాలంలోనే ఈ ప్రాంతం జాగిరుదారగు దావూద్‌ఖాన్‌కు ఇవ్వబడింది. ఇతని సోదరుడైన ఇబ్రహీంఖాన్ వంశీయులే కర్నూలు నవాబులు.

నిజాం ఉల్‌ముల్క్ 1784లో మరణించటంతో వారసత్వం తగాదాల్లో కర్నూలు నవాబైన హిమయత్‌ఖాన్ జోక్యం చేసుకొని, నాజర్‌జంగును జింజీ వద్ద చంపి వేసినాడు. ఫ్రెంచి సేనాని, సలాబత్ జంగ్‌లు కలసి కర్నూలు నవాబులను 1751లో లొంగదీసుకున్నారు. మైసూరు పాలకుడైన హైదరాలీ 1775లో కర్నూలు పైకి దండెత్తి వచ్చినప్పుడు, నవాబు కొంత ధనమిచ్చి పంపినాడు. టిప్పుసుల్తాను 1779లో మరణించ టంతో, కర్నూలు నైజాం నవాబు పాలన కిందకు వచ్చింది. నైజాం నవాబు 1800సం॥లో బ్రిటిషు వారి సైనిక ఖర్చులకు గాను కర్నూలు జిల్లాను ఇచ్చివేసినాడు. ఏటా లక్ష రూపాయలు కప్పం చెల్లించే షరతుమీద, ఇంగ్లీషువారు ఈ జిల్లాను నవాబుల కిందనే ఉంచినారు.

ఆఖరి నవాబైన గులాం రసూల్ ఖాన్ 1838లో ఇంగ్లీషు వారికి వ్యతిరేకంగా కుట్ర చేసినందు వల్ల ఇంగ్లీషువారు కర్నూలును స్వాధీనపర్చుకున్నారు. అప్పటి నుంచి 1858 వరకు ఈ ప్రాంత పరిపాలన కమీషనర్ చూస్తుండేవాడు. నందికొట్కూరు, నంద్యాల, సిరివెళ్ళ, రామళ్ళకోట కమీషనర్ పరిపాలనలో ఉండేవి.

బ్రిటిషు ప్రభుత్వం 1858లో కోయిలకుంట్ల, కంభం, మార్కాపురం తాలూకా లను కడపజిల్లా నుంచి, పత్తికొండ తాలూకాలను బళ్ళారి జిల్లానుంచి విడదీసి కర్నూలు జిల్లాలో కలిపినారు.

ఆంధ్రరాష్ట్ర విభజన 1953 అక్టోబరులో జరగడం వల్ల, ఆదోని, ఆలూరు తాలూకాలను బళ్ళారి నుంచి విడదీసి కర్నూలులో కలిపినారు. మొట్ట మొదటి ఆంధ్ర రాష్ట్ర రాజధానిగా కర్నూలును ఏర్పరచినారు.

ఈ జిల్లాలో ఎర్రమల, నల్లమల, వెలిగొండలు అనే మూడు ముఖ్యమైన కొండ ప్రాంతాలున్నాయి, ఈ జిల్లా సహజ స్వరూపాన్ని బట్టి పశ్చిమ, మధ్య ప్రాంతాలుగా విభజించారు. ఎర్రమల కొండలకు పశ్చిమాన ఉన్న పత్తికొండ, కర్నూలు, డోన్,

ఆదోని, ఆలూరు తాలూకాలున్న ప్రాంతం పడమటి ప్రాంతంగా పరిగణించ బడుతున్నది. ఈ ప్రాంతంలో అక్కడక్కడ కొండలు గుట్టలు ఉండి దక్షిణ దిక్కునుంచి ఉత్తర దిక్కునకు ఏటవాలుగా దిగుతున్నది. ఎర్రమల, నల్లమల కొండల మధ్య ఉన్న నంది కొట్కూరు, నంద్యాల, కోయిలకుంట్ల, బనగానపల్లి, ఆత్మకూరు తాలూకాలున్న ప్రాంతాన్ని మధ్య ప్రాంతంగా పరిగణిస్తున్నారు. ఈ ప్రాంతంలో సముద్రమట్టానికి 180 నుంచి 200 మీటర్ల ఎత్తున ఉన్న గుట్టలున్నాయి. వీటి మధ్య ఏర్పడిన లోయను 'కుంమలోయ' అని అంటారు. ఇక్కడ పుట్టి ప్రవహిస్తున్న నదిపేరు కుందునది. ఎర్రమల కొండలు డోన్, కర్నూలు తాలూకాలకు తూర్పుభాగం నుంచి, బనగానపల్లి, నంద్యాల తాలూకాలకు పశ్చిమ భాగం ద్వారా పోతున్నాయి. ఎర్రమల కొండలకు ఉత్తరాన తమ్మరాజుపల్లి కనుమ, దక్షిణాన రాంపల్లి కనుమ అనే రెండు ముఖ్యమైన కనుమలున్నాయి.

నల్లమలకొండలు ఈ జిల్లా దక్షిణాన్నుంచి ఉత్తరానికి 112 కి.మీ. పొడవున వ్యాపించి ఉన్నాయి. ఈ కొండలు దక్షిణంగా కడపజిల్లాలోని పెన్నానది ప్రవాహం వరకు, ఉత్తరంగా మహబూబ్‌నగర్ జిల్లాలోకి వ్యాపించి ఉన్నాయి. ఈ కొండల్లో నంది కనుమ, మంత్రాలకనుమ ముఖ్యమైనవి.

ఈ జిల్లాలో తుంగభద్ర, కృష్ణ, హంద్రి, కుందేరు, గుండ్లకమ్మ అనే ముఖ్యమైన నదులు ప్రవహిస్తున్నాయి. తుంగభద్రానది పడమటి కనుమల్లో పుట్టి ఈ జిల్లా ఉత్తర సరిహద్దుగా ప్రవహించి, నంది కొట్కూరు తాలూకాలోని సంగమేశ్వరం వద్ద కృష్ణా నదిలో కలుస్తున్నది.

కృష్ణానది పడమటి కనుమల్లో మహాబలేశ్వరం వద్ద పుట్టి కర్ణాటక రాష్ట్రం ద్వారా నందికొట్కూరుకు ఉత్తర భాగంలో ప్రవహిస్తూ, జిల్లా ఉత్తర సరిహద్దుగా ఏర్పడిన ప్రకాశంజిల్లాలోకి, కర్నూలు జిల్లా తూర్పున ఉన్న పాతాళగంగ ద్వారా పోతున్నది. హంద్రినది పత్తికొండ తాలూకాలో పుట్టి, పత్తికొండ కర్నూలు తాలూకాల ద్వారా ప్రవహించి కర్నూలు పట్టణానికి దిగువన తుంగభద్రానదిలో కలుస్తున్నది. ఈ నదికి ఎర్రమల కొండల్లో కురిసిన వర్షపు నీరు లభిస్తోంది. కుందునది ఎర్రమల కొండల్లో పడమటి వైపున పుట్టి ఈశాన్య మూలంగా నంద్యాల తాలూకాల్లో ప్రవహించి అక్కడి నుంచి దక్షిణానికి మళ్ళి నంద్యాల, కోయిలకుంట్ల, ఆళ్ళగడ్డ తాలూకాల ద్వారా ప్రవహించి కడప జిల్లాలోకి ప్రవేశిస్తున్నది.

గుండ్లకమ్మ నది నల్లమల కొండల్లో గుండ్ల బ్రహ్మేశ్వరం దగ్గర పుట్టున్నది. ఈ జిల్లాలో ప్రవహిస్తున్న ఇతర చిన్న ప్రవాహాలు సగిలేరు, రాళ్ళవాగు, మునిమడుగు లేరు, బండ్రప వాగు, పంగిడి వాగు, పాలేరు, పక్కిలేరు మొదలైనవి.

రాష్ట్రంలోని అటవీ విస్తీర్ణంలో ఈ జిల్లా 5.1 శాతంతో తొమ్మిదవ స్థానంలో ఉంది. 1974-75 సం॥ లెక్కల ప్రకారం జిల్లాలో 3,21,765 హెక్టార్లు అడవుల కింద ఉంది. కంభం, నందికొట్కూరు తాలూకాల్లో ఎక్కువ భాగం అడవి. పీఠభూమి ప్రాంతంలోని అడవుల్లో మంచిరకపు టేకు చెట్లున్నాయి. ఈ జిల్లాలోని అడవుల్లో బీడీ పరిశ్రమకు పనికి వచ్చే ఆకు, కలప ఎక్కువగా లభిస్తున్నది.

జిల్లాలో అత్యధిక ఉష్ణోగ్రత 43.8°C. అత్యల్ప ఉష్ణోగ్రత 21.7°C. జిల్లాలో నల్లమల కొండలకు పశ్చిమంగా ఉన్న ప్రాంతానికి నైరుతి రుతుపవనాల వల్లనే ఎక్కువ వర్షపాతం లభిస్తోంది. సరాసరి వర్షపాతం 622.3 మి.మీ. నంద్యాల, ఆత్మకూరు ప్రాంతాలు అత్యధిక వర్షపాతాన్ని, అవుకు చుట్టు పక్కల ప్రాంతాలు అత్యల్ప వర్ష పాతాన్ని పొందుతున్నాయి.

ఇక్కడ లభ్యమయ్యే ఖనిజాల్లో ముఖ్యమైనవి — ముగ్గురాయి, సున్నపురాయి, రాగి, ముడి ఇనుము. ఈ జిల్లాలోని వెల్దుర్తి రామల్లకోట ప్రాంతాల్లో సుమారు 3.76 మిలియన్ టన్నుల ఇనుప ఖనిజం ఉన్నట్లు అంచనా వేసినారు. బనగానపల్లి, రామల్ల కోట ప్రాంతాల్లో సుమారు 3.76 మిలియన్ టన్నుల ఇనుప ఖనిజం ఉన్నట్లు అంచనా వేసినారు. బనగానపల్లి, రామల్లకోట ప్రాంతాల్లో వజ్రాలు దొరుకుతున్నాయి. ఇంకా వీటికోసం పరిశోధన సాగుతున్నది.

1981 గణాంకాల ప్రకారం ఈ జిల్లా జనభా మన రాష్ట్రంలో పదకొండవ స్థానాన్ని ఆక్రమించింది. జిల్లాలోని మొత్తం జనాభా 24,04,358 మంది. అందులో 12,24,793 మంది పురుషులు, 11,79,565 మంది స్త్రీలు ఉన్నారు. ఒక చ.కిమీ. కు జన సాంద్రత 136 మంది. అక్షరాస్యత : పురుషుల్లో 39.51 శాతం, స్త్రీలల్లో 16.92 శాతం, ప్రతి వెయ్యి మంది పురుషులకు 963 మంది స్త్రీలు ఉన్నారు. రాష్ట్ర జనాభాలో 4.49 శాతం ఈ జిల్లాలో ఉన్నారు.

ఈ జిల్లాలో తెలుగు మాతృభాష గలిగిన వారి జనాభా తర్వాత పరిగణింప దగిన వారు ఉర్దూ, కన్నడం, మరాఠీ, లంబాడీ, యెరుకల భాషలు మాట్లాడే వారు.

ముఖ్యమైన నీటి వనరును, కర్నూలు - కడప కాలువ కలుపుతున్నది. కర్నూలుకు పశ్చిమాన 26 కి.మీ. దూరంలో సుంకేశుల వద్ద తుంగభద్రా నదికి అడ్డంగా నిర్మించబడిన ఆనకట్టనుంచి ఈ కాలువ తవ్వబడింది. ఈ కాలువ కర్నూలు, నంది కొట్కూరు, నంద్యాల, ఆళ్ళగడ్డ తాలూకాల ద్వారా పోతున్నది. తుంగభద్ర కాలువ కింద ఆదోనిలో కొంత భాగం సాగు చేయబడుతున్నది. ఇవికాక, బావులు, చెరువులు ముఖ్యమైన ఇతర నీటి సదుపాయాలు. అయితే ఇవి అన్నీ వర్షాలపై ఆధారపడి ఉండటంతో అప్పు డప్పుడు అనావృష్టికి గురి అవుతుంటాయి. శ్రీశైలం దగ్గర కృష్ణానదిపై శ్రీశైలం హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్టు నిర్మిస్తున్నారు.

ఈ జిల్లాలో పండే ముఖ్యమైన పంటలు — జొన్న, కొర్ర, వేరుశనగ, పత్తి. బంగినపల్లి మామిడి పండ్లకు ఈ జిల్లా ప్రసిద్ధి చెందింది.

కర్నూలు, నంద్యాల, ఆదోని పట్టణాలు పరిశ్రమలకు ముఖ్యమైన కేంద్రాలుగా ఉన్నాయి బనగాన పల్లి దగ్గరలో ఉన్న పాణ్యం సిమెంటు ఫ్యాక్టరీ, ఆదోనిలో ఉన్న మూడు టెక్స్‌టైల్ మిల్లులు, ఎమ్మిగనూరు స్పిన్నింగ్ మిల్లు, కర్నూలులోని బిర్లా వనస్పతి ఫ్యాక్టరీ, వేరుశనగ నూనె మిల్లులు జనపనార పరిశ్రమలు, రాయలసీమ పేపరు మిల్లు ఈ జిల్లాలో చెప్పుకోదగిన పరిశ్రమలు. పాణ్యం సిమెంటు ఫ్యాక్టరీలో కాల్షియమ్ కార్బైడును ఉత్పత్తి చేసే యూనిట్టును నెలకొల్పినారు. నంద్యాల, ఆదోని పట్టణాల్లో ఇండస్ట్రియల్ ఎస్టేట్లు నెలకొల్పబడినాయి.

మద్రాసు నుంచి బొంబాయికి వెళ్ళే బ్రాడ్‌గేజ్ రైలు మార్గం పత్తికొండ, ఆలూరు, ఆదోని తాలూకాల ద్వారా మచిలీపట్నం నుంచి గోవాకు వెళ్ళే రైలు మార్గం నంద్యాల, డోన్, పత్తికొండ తాలూకాల ద్వారా, పోతున్నాయి. డోన్ నుంచి సికిందరాబాద్ వెళ్ళే బ్రాంచి లైన్ కర్నూలు మీదుగా పోతున్నది.

హైదరాబాద్, బెంగుళూర్‌లను కలిపే జాతీయ రహదారి దాదాపు 100 కి.మీ. ఈ జిల్లాలో ఉంది. ఇదికాక కర్నూలు నుంచి నంద్యాల, ఆళ్ళగడ్డ తాలూకాల మీదగా కడప, చిత్తూరు జిల్లాలకు పోతున్న రాష్ట్ర రహదారి మద్రాసుకు చేరే జాతీయ రహదారితో కలుస్తుంది.

వృత్తి విద్యకు సంబంధించి కర్నూలులో ఒక వైద్య కళాశాల, నంద్యాలలో పాలిటెక్నిక్ కళాశాల ఉన్నాయి. ఈ జిల్లాలో అయిదు ప్రభుత్వ డిగ్రీ కళాశాలలు ఏడు ప్రైవేటు డిగ్రీ కళాశాలలు ఉన్నాయి. కర్నూలు పట్టణంలో ఒక ప్రభుత్వ మహిళా కళాశాల ఉంది.

దక్షిణ భారత దేశంలో ఉన్న పురాతనమైన పుణ్య క్షేత్రాల్లో శ్రీశైల క్షేత్రం కూడా ఒకటి. ఇక్కడ ఉన్న మల్లికార్జున స్వామిని ఆది శంకరులు కూడా కొలిచినట్లు ప్రతీతి. దేశంలో ఉన్న ద్వాదశ జ్యోతిర్లింగాల్లో ఇక్కడ ఉన్న లింగం కూడా ఒకటి. మహా శివరాత్రి ఇక్కడ వైభవోపేతంగా జరుగుతుంది.

నంద్యాలకు 16 కి.మీ. దూరంలో మహానంది ఉన్నది. ఇక్కడ మాఘ బహుళ చతుర్దశి నుంచి నాలుగు రోజులు మహానందీశ్వరునికి ఉత్సవాలు జరుగుతాయి. మహానందికి పదహారు కి.మీ. పరిధిలో నవనందులున్నాయి.

ఆదోని తాలూకాలో ఉత్తర దిక్కున తుంగభద్రా నది తీరాన, మంత్రాలయంలో మధ్వాచార్యులు శ్రీ రాఘవేంద్రస్వామి సమాధి ఉన్నది. ప్రతి సంవత్సరం శ్రావణ శుద్ధ చతుర్దశి నుంచి బహుళ పంచమి వరకు రథోత్సవం జరుగుతుంది.

ఆళ్ళగడ్డకు 26 కి. మీ. దూరంలో అహోబిలం ఉంది. ఇది వైష్ణవులకు దర్శనీయ స్థానం. ఇక్కడ నరసింహస్వామి ఆలయం ఉన్నది.

# 2

# విషయ సేకరణ

వ్యవహర్తల దగ్గరనుంచి విషయ సేకరణ చెయ్యటానికి ప్రశ్నావళి తయారు చేసుకోవడం జరిగింది. ప్రశ్నావళిలో నామపద విభాగానికి, క్రియా విభాగానికి, సంఖ్యా పదాలకు, బాంధవ్యబోధక పదాలకు సంబంధించిన వివరాలు, సామాజిక భాషా శాస్త్ర అధ్యయనానికి అవసరమైన వ్యవహర్తల వివరాలు : పేరు, వృత్తి, చదువు, వయస్సు మొదలైనవి ఉంటాయి. ఇవికాక ప్రతి వ్యవహర్తను కలుపుగోలుగా మాట్లాడించి ఆతని వ్యావహారికాన్ని టేప్‌రికార్డింగ్ చేసుకొని దానిని ధ్వని విధేయంగా రాసుకోవడం జరిగింది. ఈ వ్యవహార ఖండికలు జీవితానుభవాలకు సంబంధించి కానీ, అభిప్రాయ ప్రకటనలకు సంబంధించి కానీ ఒక్కొక్కసారి అనేక విషయాలకు సంబంధించి కూడా ఉండవచ్చు. ఇందులోనే మాండలిక పదాలు, వ్యాకరణ విశేషాలు ఎక్కువ బహిర్గతమయినాయి. అందు వలన ప్రశ్నావళిలో సేకరించిన సమాచారంకన్నా వ్యవహారఖండికలే భాషా విశ్లేషణకు ఎక్కువ తోడ్పడినాయి.

కర్నూలు జిల్లాలో పన్నెండు కేంద్రాలను ఎన్నుకొని ఆ కేంద్రాలను పర్యటించి విషయ సేకరణ చేయడం జరిగింది. అవి : 1. నంద్యాల, 2. నందికొట్కూరు, 3. కర్నూలు, 4. ఎమ్మిగనూరు, 5. ఆదోని, 6. పత్తికొండ, 7. ఆళ్ళగడ్డ, 8. కోయిలకుంట్ల, 9. బనగానపల్లి, 10. ఆలూరు, 11. దోన్, 12. ఆత్మకూరు. ప్రతి కేంద్రంనుంచి తీసుకున్న కనీస వ్యవహర్తల సంఖ్య నాలుగు. అందులో ఒక స్త్రీవ్యవహర్త తప్పకుండా ఉంటుంది. వ్యవహర్తలు బిన్న వర్గాలకు, వయఃపరిమితులకు, విద్యా సాంఘిక స్థాయిలకు చెందినవారై ఉంటారు. ఉదాహరణకు :- 1. లెక్చరర్/టీచర్/రచయిత. 2. బ్యాంకు ఉద్యోగి/డాక్టర్/ఇంజనీర్. 3. విద్యార్థులు, 4. చదువు లేని కూలీలు, వ్యాపారస్థులు, రైతులు మొదలైన వారు. మొత్తం వ్యవహర్తల సంఖ్య అరవై. ఇందులో మూల వ్యవహర్తలు నలభై ఎనిమిది మంది, సహాయ వ్యవహర్తలు పన్నెండు మంది. ఇందులో అక్షరాస్యుల సంఖ్య (45), నిరక్షరాస్యుల సంఖ్య (15), స్త్రీల సంఖ్య (12), పురుషుల సంఖ్య (48), సేకరించిన వ్యవహర్తల్లో అయిదు కులాల వారు అగ్రవర్ణాలవారు, పదహారు వెనుకబడిన వర్ణాలవారు, ఒక షెడ్యూల్డ్ తెగ, షెడ్యూల్డ్ కులాల వారు ఉన్నారు. వారి వివరాలు :- బ్రాహ్మణ (8), కాపు (8), కమ్మ (3), వైశ్య (3), బలిజ (2), యాదవ(4), ఉప్పర (3), ఈడిగ (2), క్షురక (2), విశ్వబ్రాహ్మణ (1), దూదేకుల (1), మున్నూరు కాపు (1), తలారి (1), కటిక (1), శెట్టిబలిజ (1), సాతాని (1), తెలగ (1), బోయ (1),

కురుబ (1), రజక (1), కుమ్మరి (1), నీలిషికారి (1), హరిజన (11). వ్యవహర్తల వయస్సుకు సంబంధించిన వివరాలు : 15-20 సంవత్సరాల మధ్యవారు తొమ్మిదిమంది, 20-30 సం॥ రాల మధ్యవారు ఇరవై నాలుగు మంది, 30-40 సం॥ రాల మధ్యవారు పదకొండు మంది, 50-60 సం॥ రాల మధ్యవారు ముగ్గురున్నారు. వ్యవహర్తల వివరాలు వివరంగా కింద పట్టికలో ఇవ్వడం జరిగింది.

మాండలిక పరిశోధన ముఖ్యోద్దేశం ప్రాంతీయ, సాంఘిక, సామ్యాలను - వైవిధ్యాలను సేకరించటం. ఆధునిక ప్రామాణిక భాషా ప్రభావం భిన్న ప్రాంతాల వ్యవహర్తలపై ఏ విధంగా ఉందో చూపిస్తూ, భాషా పరిణామాన్ని నిరూపించటం.

## వ్యవహర్తల వివరాల పట్టిక

| వరుస సంఖ్య | కేంద్రం పేరు | కులం | విద్య | వృత్తి | వయస్సు |
|---|---|---|---|---|---|
| 1. | నంద్యాల | రజక | లేదు | రజకవృత్తి | 30 |
| | | బ్రాహ్మణ | ఇంటర్ | బ్యాంక్ ఉద్యోగి | 42 |
| | | కాపు | ఎమ్.ఏ. బి.ఇడి. | లెక్చరర్ | 36 |
| | | విశ్వబ్రాహ్మణ | బి.కాం. (తృతీయ) సం॥ | విద్యార్థి | 21 |
| | | బ్రాహ్మణ(స్త్రీ) | ఎస్.ఎస్.ఎల్.సి. టీచర్ ట్రైనింగ్ | టీచర్ | 37 |
| | | బ్రాహ్మణ | బి. యస్. సి. | రచయిత | 32 |
| 2. | నందికొట్కూరు | బ్రాహ్మణ | బి.ఎ. బి.ఎల్. | అడ్వకేట్ | 56 |
| | | హరిజన | అయిదవ తరగతి | కూలీ | 22 |
| | | హరిజన | ఇంటర్(ద్వితీయ) సం॥ | విద్యార్థి | 18 |
| | | దూదేకుల(స్త్రీ) | ఎస్.ఎస్.ఎల్.సి. టీచర్ ట్రైనింగ్ | టీచర్ | 28 |
| | | నీలిషికారి | లేదు | కూలీ | 30 |
| 3. | కర్నూలు | బ్రాహ్మణ | ఎల్.సి.ఇ | ఇంజనీర్ | 42 |
| | | ఈడిగ (స్త్రీ) | బి.ఎ. | రచయిత్రి | 30 |
| | | కాపు | బి.ఎ. (ద్వితీయ) సం॥ | విద్యార్థి | 19 |

| వరుస సంఖ్య | కేంద్రం పేరు | కులం | విద్య | వృత్తి | వయస్సు |
|---|---|---|---|---|---|
| | | కమ్మ | లేదు | రైతు | 30 |
| | | బ్రాహ్మణ | బి.ఎ. (ద్వితీయ) సం॥ | విద్యార్థి | 20 |
| 4. | ఎమ్మిగనూరు | యాదవ | బి.ఎ. బి.ఇడి. | టీచర్ | 44 |
| | | హరిజన (స్త్రీ) | లేదు | కూలీ | 35 |
| | | ఉప్పర | బి.టెక్. | ఇంజనీర్ | 22 |
| | | మున్నూరుకాపు | యం.బి.బి.యస్. | డాక్టర్ | 40 |
| | | ఉప్పర | ఎస్.ఎస్.సి. | చిల్లర వ్యాపారి | 23 |
| | | యాదవ | లేదు | రైతు | 35 |
| 5. | ఆదోని | కమ్మ (స్త్రీ) | ఇంటర్ | టైపిస్ట్ | 22 |
| | | హరిజన | ఎమ్. ఎ. | లెక్చరర్ | 29 |
| | | వైశ్య | ఎస్.ఎస్.ఎల్.సి | రాజకీయవేత్త | 48 |
| | | తలారి | లేదు | రైతు | 60 |
| | | వైశ్య | బి.కాం (ప్రథమ) సం॥ | విద్యార్థి | 18 |
| 6. | పత్తికొండ | కటిక | [illegible] | లెక్చరర్ | 29 |
| | | యాదవ (స్త్రీ) | లేదు | అటెండర్ | 40 |
| | | కమ్మ | బి.కాం. | బ్యాంక్ ఉద్యోగి | 29 |
| | | మరక | ఎమ్.కాం | విద్యార్థి | 22 |
| | | కుమ్మరి | లేదు | కుమ్మరం | 30 |
| 7. | ఆళ్ళగడ్డ | కాపు | బి.ఎ. బి.ఎల్. | అడ్వకేట్ | 50 |
| | | హరిజన | ఎమ్.ఎ. | లెక్చరర్ | 28 |
| | | ఉప్పర | లేదు | కూలీ | 30 |
| | | యాదవ | ఐ.టి.ఐ. | ఇన్‌స్ట్రక్టర్ | 21 |
| | | కాపు (స్త్రీ) | బి.ఎ. (తృతీయ) సం॥ | విద్యార్థిని | 19 |
| 8. | కోయిలకుంట్ల | కాపు | ఎమ్.కాం. | లెక్చరర్ | 28 |
| | | శెట్టి బలిజ | ఎస్.ఎస్.ఎల్.సి | అకౌంటెంట్ | 34 |
| | | సాతాని | బి.ఎ. (ద్వితీయ) సం॥ | విద్యార్థి | 22 |
| | | హరిజన (స్త్రీ) | లేదు | వంటమనిషి (హాస్టల్) | 50 |

| వరుస సంఖ్య | కేంద్రంపేరు | కులం | విద్య | వృత్తి | వయస్సు |
|---|---|---|---|---|---|
| 9. | బనగానపల్లి | క్షురక | బి.కాం. | విద్యార్థి | 24 |
| | | కాపు (స్త్రీ) | బి.ఎ. (తృతీయ) సం॥ | విద్యార్థిని | 18 |
| | | హరిజన | ఎస్.ఎస్.ఎల్.సి. | రాజకీయవేత్త | 30 |
| | | బ్రాహ్మణ | ఎమ్.ఎ | ప్రిన్సిపాల్ | 49 |
| | | తెలగ | లేదు | కూలీ | 60 |
| 10. | ఆలూరు | హరిజన (స్త్రీ) | లేదు | కూలీ | 30 |
| | | బోయ | ఇంటర్ (ప్రథమ) సం॥ | విద్యార్థి | 17 |
| | | వైశ్య | ఎస్.ఎస్.ఎల్.సి. | డ్రాయింగ్ మాస్టర్ | 42 |
| | | కాపు | ఎస్.ఎస్.ఎల్.సి. | బ్యాంక్ ఉద్యోగి | 31 |
| 11. | డోన్ | హరిజన | లేదు | రైతు | 40 |
| | | బలిజ | బి.ఎ. (తృతీయ) సం॥ | విద్యార్థి | 21 |
| | | కురుబ | ఎమ్.ఎ. బి.ఇ.డి | లెక్చరర్ | 44 |
| | | హరిజన (స్త్రీ) | లేదు | కూలీ | 38 |
| 12. | ఆత్మకూరు | హరిజన | ఎమ్.బి.బి.యస్. | డాక్టర్ | 30 |
| | | బలిజ | లేదు | వాచ్ మెన్ | 45 |
| | | బ్రాహ్మణ | ఎమ్.ఎ. | లెక్చరర్ | 36 |
| | | వైశ్య (స్త్రీ) | ఇంటర్ (ప్రథమ) సం॥ | విద్యార్థిని | 17 |
| | | కాపు | ఇంటర్ (ద్వితీయ) సం॥ | విద్యార్థి | 18 |
| | | ఈడిగ | ఎమ్.ఎ. | టీచర్ | 34 |

# 3

# కర్నూలు జిల్లా వ్యావహారిక భాష

శ్రీ కె. రమేష్ కుమార్

కర్నూలు జిల్లా ఆంధ్రప్రదేశ్ సరిహద్దులో ఉండటం మూలంగా భాషాశాస్త్ర రీత్యా ప్రధానమైందని చెప్పవచ్చు. ఈ జిల్లా భాషా పరంగా దక్షిణ మండలానికి చెందుతుంది. అయితే ఈ జిల్లా భాషలో దక్షిణమండలం లక్షణాలతో పాటు ఉత్తరమండలం లక్షణాలు కూడా పదజాలంలో కొన్ని వ్యాకరణ ప్రక్రియలకు చెందిన విశేషాలలో కనిపిస్తాయి. ఇవి గాక కన్నడ భాషనుంచి వచ్చిన ఎరువు రూపాలు కూడా కనిపిస్తాయి. దీనికి కారణం ఈ జిల్లాలో ప్రస్తుతం ఉన్న ఆలూరు, ఆదోని తాలూకాలు ఒకప్పుడు బళ్ళారి జిల్లాలో ఉండడంవల్ల కావచ్చు. అలాగే నంద్యాల, ఆళ్ళగడ్డ, కోయిలకుంట్ల తాలూకాల్లో కడప ప్రభావం కనిపిస్తుంది. దీనికి కారణం ఈ తాలూకాలు కడప జిల్లాకు సమీపవర్తులవడం. అలాగే నందికొట్కూరు, కర్నూలు, ఆత్మకూరు తాలూకాల్లో మహబూబ్‌నగర్ జిల్లా లక్షణాలు కనిపిస్తాయి. అంతేకాక, ఆధునిక తెలుగు ప్రామాణిక భాషగా ప్రస్తుతం చలామణి అవుతున్న కోస్తా జిల్లా విద్యావంతుల భాషా ప్రభావం ఈ జిల్లా విద్యావంతుల వ్యవహారంపై ఉన్నట్లు తెలుస్తున్నది. కాబట్టి ఈ జిల్లా భాషపై విభిన్న ప్రాంతాల భాషల ప్రభావం ఉందని చెప్పటానికి వీలవుతున్నది. వీటన్నిటి సమ్మేళనం కర్నూలు జిల్లా మాండలికం అని అనుకోవచ్చు.

కర్నూలు జిల్లా వ్యావహారికభాష పరిశీలనా సౌలభ్యం కోసం ఈ అధ్యాయాన్ని అయిదు భాగాలుగా విభజించడం జరిగింది. I. విద్యావంతుల వ్యవహార విశేషాలు, II. నిరక్షరాస్యుల వ్యవహారం - కొన్ని విశేషాలు, III. కర్నూలు మాండలికం - సామాన్య లక్షణాలు, IV. కర్నూలు మాండలికం - ఆధునిక తెలుగు ప్రామాణిక భాష, V. పదజాలం - కొన్ని విశేషాలు.

## I. విద్యావంతుల వ్యవహారవిశేషాలు

*వర్ణ విభాగం –*

ఆధునిక ప్రామాణికాంధ్రభాషలోని భూతకాలిక ప్రత్యయం 'ప్టే' ఇక్కడి విద్యావంతుల వ్యావహారికంలో ఉంది. ఈ జిల్లాలోని రచయితలు చాలా మంది వారి రచనలను ఆధునిక ప్రామాణికాంధ్ర భాషలో సాగిస్తుండటం వల్ల ఆ ప్రభావం వారి వ్యావహారికం పై ఉన్నట్లు కనిపిస్తున్నది. వారిలో 'ప్టే' వర్ణం ఉన్న రూపాలు ఎక్కువగాను, ప్రాంతీయ రూపాలు అరుదుగాను కన్పించాయి. లెక్చరర్లలో విద్యార్థుల్లో

ప్రాంతీయ రూపాలతో పాటు, 'ఏ'* వర్ణం ఉన్న భూతకాలిక రూపాలు కూడా ఎక్కువ గానే వాడుకలో ఉన్నాయి.

ఉదా॥

చెప్పేసు.
చూసేను.
పెట్టేసు.
అడిగే డు
అరిచేవు.

మహా ప్రాణోచ్చారణ విద్యావంతుల్లో ఉంది. అయితే వారు కూడా దాన్ని కొన్నిసార్లు ఉచ్చరించడం, కొన్ని సార్లు ఉచ్చరించక పోవడం జరిగింది.

| మహాప్రాణత్వం ఉన్న రూపాలు :- | మహాప్రాణత్వం లేని రూపాలు :- |
|---|---|
| నిధులు | బక్తులు |
| భగవంతుని | అంతస్తులు |
| ఖచ్చితంగా | కర్చుపెట్టి |
| ఆర్థికంగా | రతం |
| | దర్మాస్పతి |

మొదటి వర్గానికి చెందిన వారిలో మూర్ధన్య దంత మూలీయ భేదం నిల్చిఉంది. విద్యావంతుల్లోనే తక్కిన వర్గాల వారిలో (విద్యార్థులు, డాక్టర్లు మొ॥ వారిలో) కొందరిలో ఈ భేదం కన్పించడం లేదు. దీని కారణాల కోసం ఇంకా పరిశీలించవలసి ఉంది.

| మూర్ధన్య వర్ణాలు ఉన్న రూపాలు | మూర్ధన్యత లోపించిన రూపాలు |
|---|---|
| వీణ | కర్నమయ్య |
| దాణా | కూలోళ్లు |
| మరణం | కాల్లు |
| కళలకు | నీల్లు |
| కళ్ళం | |

ఈ జిల్లాలోని విద్యావంతుల వ్యావహారికంలో /ఫ్/ † వర్ణం /ప/ వర్ణం రెండూ వేరు, వేరు వర్ణాలుగా ఉన్నాయి. /ఫ్/ వర్ణోచ్చారణ ఉన్న అన్య దేశ్యాలను వీరు తెలుగు లోనికి అనువదించడం కాని, వాటికి సమానమైన పదాలను వాడడం కాని జరగలేదు.

| | | |
|---|---|---|
| టిఫ్ఫిన్ | / ṭifın / | 'tıffın' |
| కాఫ్ఫీ | / ka: fı : / | 'coffee' |
| ఫోటో | / fo: ṭo : / | 'photo' |
| ఆఫ్ఫీసు | / a:fi:s / | 'office' |
| టెలిఫ్ఫోన్ | / ṭelıfo:n / | 'telephone' |

* 'ఏ' వర్ణానికి ఇంగ్లీషులోని "æ" తో సమానమైన ఉచ్చారణ.

† 'ఫ్' వర్ణానికి ఇంగ్లీషులోని 'f' తో సమానమైన ఉచ్చారణ ఉంది.

ఈ పైన తెల్పిన ఆంగ్ల భాషా పదాలు ఇక్కడి ప్రజల వాడుకలో ఇమిడి పోయి ఉన్నందువల్ల వారిలో అవి అన్య దేశ్యాలనే భావన లేకుండా పోయింది. దీనికి కారణం వీరి నిత్య జీవితంలో ఆంగ్ల భాషా ప్రభావం ఎక్కువగా ఉండటమని తెలుస్తున్నది. కావున వర్ణ మాలలో 'ఫ్' వర్ణాన్ని కూడా చేర్చ వలసి ఉంటుంది.

విద్యావంతుల వ్యావహారికంలో పదాది 'చ' కారం నిలిచి ఉంది. 'చ' కారం 'స' కారం అయిన రూపాలు వీరిలో చాలా అరుదుగా వినిపించాయి.

ఉదా॥

చదువు

చూసి

చేతినొప్పి

పదాది 'వ' కారం (ఇ, ఈ, ఎ, ఏ, ల ముందు) నిలిచి ఉంది.

ఉదా॥

విమర్శ

వినరు

వీడు

వెనకబడు

వెళ్లాను,

వేడి.

సంయుక్త హల్లుల ఉచ్చారణ వీరి వాడుకలో సాధారణంగా నిలిచి ఉంటుంది.

ఉదా॥

దర్శనం

సంతృప్తి

సంస్కృతి

చేస్తారు

పత్రికలు.

కొందరి విద్యార్థుల వ్యావహారికంలో మాత్రం సంయుక్తహల్లు 'స్తా' 'స్సా' గా వర్ణ సమీకరణం చెందడం జరిగింది.

ఉదా॥

చేస్సాన్నాడు

పిలుస్సాం.

వస్సాండా.

ఈ జిల్లాలోని కొంతమంది లెక్చరర్ల భాషలో, రచయితల వాడుకలో శ,ష వర్ణాలు నిలిచి ఉన్నాయి. 'స' వర్ణం అందరి వాడుకలోనూ ఉంది.

ఉదా॥

| | | |
|---|---|---|
| శర్మ | షాపు | సభలు |
| శాల్వ | షోక్ చేస్కొని | సంప్రాదాయం |

| | | |
|---|---|---|
| పశువులు | రోషం | సమానం |
| | విషయం | |

పదాది అచ్చుల్లో వినిపించిన కొన్ని పర్యాయ రూపాలు :

అ>ఒ : పొప్పన్నం (పప్పన్నం), మొబ్బు (మబ్బు).
ఏ>ఏ : మేకపోతు (మేకపోతు), మేళాల లోటిగ (మేళాలతో).
ఎ>ఒ : రొండు (రెండు), జోబిలోంచి (జేబిలోంచి)

హల్లుల్లో వినిపించిన పర్యాయ రూపాలు :

ద>జ : గాజ (గాదె).
వ>బ : బెయ్యి (వెయ్యి).
వ>గ : తాగ్గోకుండ (తవ్వకుండ).
ణ>గ : రేగి పండ్లు (రేణిపండ్లు).

మూర్ధన్య వర్ణమైన 'ట' కారాన్ని పదమధ్యంలో 'త' కారంగా పలకడం ఇక్కడి విద్యావంతుల్లో ఎక్కువగా జరుగుతుంటుంది. ఈ కింది పదాలను పరిశీలిస్తే విశదమౌతుంది.

-ట->త : పొయ్యేతోడు (పొయ్యేటోడు),
పండుపనే తోళ్లు (పండుకునే టోళ్ళు),
రాసే తప్పుడు (రాసేటప్పుడు),
తీసుకునేతప్పుడు (తీసుకునేటప్పుడు),

ఇక్కడి వాడుకలోని కొన్ని వర్ణసమీకృత రూపాలు :

| పదం | | కర్నూలు వ్యావహారికం | సమీకృతులు |
|---|---|---|---|
| రాజ్యం | > | రాజ్జెం | జ్య > జ్జె |
| ఉద్యోగం | > | ఉద్దోగం | ద్యో > ద్దో |
| నిరుద్యోగులు | > | నిరుద్దోగులు | ద్యో > ద్దో |
| మధ్యన | > | మద్దెన | ధ్య > |
| బాధ్యత | > | బాద్దెత | ధ్య > |
| ముఖ్యమైన | > | ముక్కెమైన | ఖ్య > క్కె |
| పరీక్ష | > | పరీచ్చ | క్ష > చ్చ |
| అక్షరాస్యులు | > | అచ్చరాస్యులు | క్ష > చ్చ |
| లక్ష | > | లచ్చ | క్ష > చ్చ |

వర్ణ వ్యత్యయం చెందిన రూపాలు విద్యార్థుల్లో వినిపించినవి :

ఉదా॥

బుగులు < గుబులు

పలుగు < పగులు

నామ పద విభాగం —

బహువచనం : ఏకవచనంలోని నామానికి —'లు' ప్రత్యయం చేర్చడం వల్ల బహువచన నామం ఏర్పడుతుంది. ఈ కింది ఏకవచన నామాలకు బహువచన ప్రత్యయం చేరినప్పుడు మార్పు లేదు.

ఉదా॥

అన్న + లు > అన్నలు
తల + లు > తలలు
బిడ్డ + లు > బిడ్డలు
పాట + లు > పాటలు
పిల్ల + లు > పిల్లలు

ఏకవచన నామం దీర్ఘాచ్చుతో అంతమై ఉన్న అన్య దేశ్యాల బహువచన రూపంలో మార్పులేదు.

ఉదా॥

ఏకీ + లు > ఏకీలు
లుంగీ + లు > లుంగీలు
కుర్చీ + లు > కుర్చీలు

విద్యా వంతుల వాడుకలో ఇంగ్లీషు పదాలకు తెలుగు బహువచన ప్రత్యయం 'లు' చేర్చడం జరుగుతున్నది.

ఉదా॥

బాంబు + లు > బాంబులు
నోటీసు + లు > నోటీసులు
సైన్టిస్టు + లు > సైటిస్టులు

విద్యావంతులు అప్పుడప్పుడు ఇంగ్లీషు బహువచన ప్రత్యయమైన—ఎస్ (s) ను కూడా వాడుతుంటారు.

ఉదా॥

స్టోరీ > స్టోరీస్
మంత్లీ > మంత్లీస్
ప్రేక్టికల్ > ప్రేక్టికల్స్
బ్లేడ్ > బ్లేడ్స్

బహువచన ప్రత్యయం చేరినప్పుడు ఏకవచన నామంలో కొన్ని మార్పులు జరుగుతున్నాయి.

ఉకారాంత శబ్దాల్లో చివరి అచ్చుకు ముందున్న 'ల' కారం మూర్ధన్యమవుతున్నది.

ఉదా॥

చాలు + లు > చాళ్ + లు > చాళ్ళు
కీలు + లు > కీళ్ + లు > కీళ్ళు
కాలు + లు > కాళ్ + లు > కాళ్ళు
మైలు + లు > మైళ్ + లు > మైళ్ళు

-ండి, -ండు అంతంలో ఉన్న శబ్దాలకు బహువచన ప్రత్యయం చేరినప్పుడు అనునాసిక వర్ణలోపం లేదు.

బండి + లు > బండ్ + లు > బండ్లు,
పండు + లు > పండ్ + లు > పండ్లు,

చివరి అచ్చుకు ముందున్న రేఫ బహువచనంలో మార్పు పొందదు.

గోరు + లు > గోర్ + లు > గో ,
నోరు + లు > నోర్ + లు > నో ,
పేరు + లు > పేర్ + లు > పే ,
ఊరు + లు > ఊర్ + లు > ఊ .

కింద ఇచ్చిన చతుర్మాత్రాక శబ్దాలోని చివరి 'లి కి -'ండి' ఆదేశం అవుతున్నది.

వాకిలి + లు > వాకిండి + లు > వాకిండ్లు
కొడవలి + లు > కొడవండి + లు > కొడవండ్లు
గొడ్డలి + లు > గొడ్డండి + లు > గొడ్డండ్లు

నాహూంతంలోని 'ల్లు, న్ను' లకు 'ండు', ఆదేశ మవుతున్నది

ఇల్లు + లు > ఇండు + లు > ఇండ్లు
ముల్లు + లు > ముండు + లు > ముండ్లు
కన్ను + లు > కండు + లు > కండ్లు

'చేను', 'పేను' శబ్దాల్లోని చివరి అక్షర లోపం కొందరి వాడుకలో ఉంది. కాని కొందరిలో ఈ లోపం లేదు. అందువలన ఈ కింది విధమైన రూపాలు ఇక్కడి వాడుకలో ఉన్నాయి.

చేను + లు > చేలు / చేన్లు
పేను + లు > పేలు / పేన్లు

పుట్టి, రెడ్డి, చెట్టు, గుడ్డు, శబ్దాల్లోని మూర్ధన్య వర్ణానికి పరంలో ఉన్న అచ్చు లోపిస్తుంది. తరువాత ద్విరుక్తం అదిర్వ్యుక్తమవుతున్నది.

పుట్టి + లు > పు + లు > పుట్ + లు > పుట్లు
రెడ్డి + లు > రె + లు > రెడ్ + లు > రెడ్లు
చెట్టు + లు > చె + లు > చెట్ + లు > చెట్లు
గుడ్డు + లు > గు + లు > గుడ్ + లు > గుడ్లు

పిల్లి, రోగి, సద్ది' శబ్దాల్లోని చివరి 'ఇ' కారం 'ఉ' గా మారుతుంది.

పిల్లి + లు > పిల్లులు
రోగి + లు > రోగులు
సద్ది + లు > సద్దులు

కోడి, తడి, బడి, శబ్దాల్లోని చివరి వ్యంజనం మూర్ధన్యమవుతున్నది.

కోడి + లు > కోళ్ + లు > కోళ్ళు
తడి + లు > తళ్ + లు > తళ్ళు
బడి + లు > బళ్ + లు > బళ్ళు

రెండక్షరాల కంటే ఎక్కువ ఉన్న ఇదంత శబ్దాల్లోని 'ల' కారం మూర్ధన్యమవుతున్నది.

నెమలి + లు > నెమళ్ + లు > నెమళ్ళు
మొసలి + లు > మొసళ్ + లు > మొసళ్ళు
కుందెలి + లు > కుందేళ్ + లు > కుందేళ్ళు

'మ' కారాంత శబ్దాల చివరి 'మ' కారం లోపించి వానికి ముందున్న 'అ, ఎ' లు దీర్ఘమవుతున్నాయి. అప్పుడు ఉపధా 'ఎ' కారం 'ఏ' కారంగా మారుతుంది.

పొలం + లు > పొలాలు
దారం + లు > దారాలు
దెయ్యం + లు > దెయ్యాలు
పందెం + లు > పందేలు
గెలెం + లు > గెలేలు

'వెయ్యి, పువ్వు' శబ్దాల్లో చివరి ద్విత్వాక్షర లోపం వల్ల పూర్వంలో ఉన్న అచ్చు దీర్ఘమవుతున్నది.

వెయ్యి + లు > వేలు
పువ్వు + లు > పూలు

రాత్రి, పెండ్లి శబ్దాలకు వరుసగా రాతిర్లు/రాత్రిప్పు, పెండ్లిండ్లు/పెళ్ళిళ్ళు అనే బహువచన రూపాలు ఇక్కడి వాడుకలో ఉన్నాయి.

'పొయ్యి, బాయి, రాయి' శబ్దాలకు వరుసగా 'పొయ్యిలు, బాయిలు, రాళ్ళు' అనే బహువచన రూపాలు ఇక్కడి వాడుకలో ఉన్నాయి.

**విభక్తి ప్రత్యయాలు:-**

ఈ జిల్లా వాడుకలో కింది విభక్తి ప్రత్యయాలు ఉన్నాయి.

(i) ద్వితీయా విభక్తి :- -ని / -ను
ఉదా॥ అమ్మాయిని నిన్ను
తమ్ముని నన్ను, చెల్లెల్ను

(ii) చతుర్థీ విభక్తి :- -కి / -కు
ఉదా॥ ఇంటికి అన్నకు
ఊరికి అమ్మకు
తిర్పతికి పైటకు
చేతికి గోవాకు

(iii) సహచారి సంబంధ కారకాలు :— -తో / -తోన / -తోని / తోటి (గ)
జ్వరంతో బెల్లంతోన పూలతోని
కేన్సర్తో కర్నూల్తోన ఉద్దేశంతోని
పుస్తకాలతో మహానందితోన

నాతోటి మేళాల తోటిగ
బావల్తోటి తప్పెట్ల తోటిగ
సద్దెన్నం తోటిగ

iv అభ్యంతరార్థకాలు : -లో/-లోపల/-లోన

ఊర్లో ఉగాదిలోపల కాలేజీలోన
బస్సులో అనేలోపల ఆఫీసులోన
బొంబాయిలో ఆదోన్లోన
పత్రికల్లో పొలడబ్బుల్లోన.

v అపాదాన కారకాలు : -నించి/-నుంచి/-నుంటి/-నుండి.

రెండు మూడేళ్ళనించి అర్ధరాత్రినుంచి బడ్నుంటి
మొదటినుంచి హైస్కూలునుంటి
ఐదారేండ్లనుండి ఒకరెవైపునుంచి ఉగాదినుంటి

vi ఉపర్యర్థకాలు : -మీద/మింద/-పైన/-మీన

ప్రజలమీద కొండమింద స్టడీస్పైన
పిల్లలమీద దానిమింద సుపీరియరుంటేపైన
పొయ్యిమీద మామిందికి ఒకరో ఇద్దరోపైన
తలమీద
సైకిలుమీన

vii అపర్యర్థకాలు : -దాకా/-దాంకా
ముప్పైదాకా ఏం దాంకా
తెల్లారేదాకా అ ందాంకా
వ చ్చదాంకా.

viii సమీపార్థకాలు: -దగ్గర/-దగ్గిర/-కాడ/-తాన/-వద్ద.

సంగీతానికి దగ్గర సమాధిదగ్గిర ఇంటికాడ
మాదగ్గర ఇండ్లదగ్గిర ఆస్పత్రికాడ
ఇండ్ల దగ్గర అమ్మవార్శాలదగ్గిర పేపరుమిల్లుకాడ
మడవల్ దగ్గర

ix నిమిత్తార్థకాలు: -కోసం/-కొరకు.

బస్కోసం చక్కెరకొరకు
కతకోసం
సినిమాలకోసం

x నిర్ణీతసమయార్థకం: -వరకు
అప్పటివరకు
ఉగాదిపొయ్యేవరకు

ఇంకా ఈ కింది అనుబంధాలు భిన్న విభక్త్యర్థాల్లో ఇక్కడ వాడుకలో ఉన్నాయి.

-గురించి
దానిగురించి
లోపాలనుగురించి
-వల్ల

దానిపల్ల
వాటిపల్ల
-తట్టు
మాఊర్లతట్టు
కిందితట్టు
-లెక్క
ఎప్పలెక్క
తనలెక్క
-గుడక్క/-గుడా/-కూడా.

| | | |
|---|---|---|
| నాకుగుడక్క | వేరుగగుడాను | ట్రైన్స్‌లేషన్స్‌కూడ |
| పాయింటుగుడక్క | వీళ్ళందరుగుడా | అవికూడ |
| షెక్కలర్‌షిప్‌గుడక్క | సంగీతం గుడా | |

-కంటే
ఆయకట్టుకంటే
అన్నిటికంటే
విస్తీర్ణంకంటే.
-ఆక
కాలేజి స్టార్ అయినాక.
-గుండ
బొక్కలోగుండ

**సంఖ్యావాచకాలు:-**

ఈ జిల్లా వాడుకలో 'పదహైదు/ పద్రైదు' (పదిహేను), 'పదారు / పదహారు 'పజ్జెనిమిది' (పద్దెనిమిది) 'నూరు' (వంద) పదాలు ఎక్కువగా వినిపిస్తాయి. కొందరి వాడుకలో నలభై/నలవై', 'యాభై/యావై', 'ఎనభై/ఎనవై' వంటి వైవిధ్యాలున్నాయి. 'వెయ్యి' ని, 'సావిరి' అని అనడం ఆదోనిలో ఇద్దరి వ్యవహర్తల్లో విన్పించింది. 'సావిరి' కన్నడ శబ్దం 'సాసిరి' (< సంస్కృతం 'సహస్రం') నుంచి ఎరువుగా వచ్చినమాట.

నూరు/వంద
రెండు నూర్లు/ఇన్నూరు/రెండువందలు
మూణ్ణూ /మున్నూరు/మూడువందలు
నాల్గునూ /నన్నూరు/నాలుగువందలు
ఐదునూ /ఐదువందలు

మనుషుల్ని లెక్కించేటప్పుడు కిందివిధంగా వాడడం జరిగింది.

| | |
|---|---|
| ఒక్కరు | ఐదుగురు/ఐదుమంది |
| ఇద్దరు | ఆరుగురు/ఆరుమంది |
| ముగ్గరు | ఏడుగురు/ఏడుమంది |
| నలుగురు | ఎనిమిదిమంది. |

కొందరిలో ఐదు సంఖ్యనుంచి -'మంది' ప్రత్యయం మొదలవుతున్నది. మరి కొందరిలో ఎనిమిది సంఖ్య నుంచే మొదలవుతున్నది. అలాగే కొందరు నూటొక్కరు అనడం మరికొందరు నూటొక్కమంది అని అనడం జరిగింది.

భావార్థకం :

ధాతువుకు-'అడం/-అటం' చేరటం వల్ల భావార్థకాలు ఏర్పడుతున్నాయి.

ఉదా॥

| | |
|---|---|
| రావడం | రావటం |
| అమ్మడం | ఉండటం |
| నాటడం | చెయ్యటం |
| వేయడం | తినటం. |

ప్రయోజనార్థకం:

తుమర్థ రూపానికి 'నీకి' చేరి చతుర్థీ విభక్త్యర్థం వస్తున్నది. ఈ రూపాన్ని ప్రయోజనార్థకంలో వాడుతున్నారు.

ఉదా॥

| | |
|---|---|
| రాయనీకి | 'రాయటానికి' |
| ఇయ్యనీకి | 'ఇవ్వటానికి' |
| జరపనీకి | 'జరపటానికి' |
| తొవ్వనీకి | 'త్రవ్వటానికి' |
| కొట్టనీకి | 'కొట్టటానికి |

## క్రియావిభాగం:

### సకర్మక-అకర్మక క్రియలు:-

అకర్మకక్రియలకు '-పు/-ంపు,' '-ఇంచు/-పిచ్చు' చేరటం ద్వారా సకర్మకక్రియలవుతున్నాయి. ఇవే ప్రత్యయాలు సకర్మక క్రియలకు చేరినప్పుడు ప్రేరణార్థకాలుగా మారుతున్నాయి.

| | | |
|---|---|---|
| **అకర్మక** | > | **సకర్మక** |
| లేచు | > | లేపు |
| తిరుగు | > | తిప్పు |
| చచ్చు | > | చంపు |
| చినుగు | > | చింపు |
| చేయు | > | చేయించు. |
| **సకర్మక** | > | **ప్రేరణార్థక** |
| పిల్చు | > | పిలిపించు |
| అను | > | అనిపించు |
| పిండు | > | పిండిచ్చు |
| ఇచ్చు | > | ఇప్పిచ్చు. |

**సమాపక క్రియలు:**

**ప్రార్థనాద్యర్థకం:** ఈ జిల్లా విద్యావంతుల వాడుకలో 'ఇచ్చు', 'చూచ్చు', 'లేచు', 'తెచ్చు' ధాతువులు ప్రార్థనాద్యర్థకంలో కింది రూపాల్లో ఉన్నాయి.

ఇచ్చు > ఈ
చూచ్చు > చూసో/చూచ్చో
లేచు > లెయ్
తెచ్చు > తే

ఇంకా ఈ కింది రూపాలు ఇక్కడ వాడుకలో ఉన్నాయి.

తోడు పడుపో
చేస్కోపో
తల్చుకో

ప్రార్థనాద్యర్థక బహువచనంలో '-అండి' చేరుతున్నది.

చెయ్యండి
రాయండి
తీసుకోండి
పెట్టండి

**నిశ్చయార్థకాలు :** ఇక్కడి విద్యావంతుల వాడుకలో '-ఆల, - ఆలె - ఆలి' ప్రత్యయాలు మూడు ఉన్నాయి. ఈ ప్రత్యయాలు ధాతువుకు చేరటంవల్ల నిశ్చయార్థకాలు ఏర్పడు తున్నాయి. '-ఆల' రూపమే ఎక్కువగా వాడుకలో ఉంది. ఇదే ప్రాంతీయ రూపమని తెలుస్తున్నది.

అధిక విద్యార్హతలు, వ్యవహార పరిధి కలవారిలో 'ఆలి' రూపం ఉంది. '-ఆలె' ప్రత్యయం ఆత్మకూరు. కోయిలకుంట్ల కేంద్రాల్లోని కొందరు వ్యవహర్తలు అప్పుడప్పుడు వాడడం జరిగింది.

| | | |
|---|---|---|
| రాయాల | రావాలి | రావాలె |
| లేపాల | చేయాలి/చెయ్యాలి | చూడాలె |
| చెయ్యాల | చేసుకోవాలి | ఐపోవాలె |
| నిండాల | చెప్పాలి | తాగాలె |

**తద్ధర్మార్థకం:** తద్ధర్మార్థక ప్రయోగాలు భిన్నరీతుల్లో ఇక్కడి విద్యావంతుల వాడుకలో ఉన్నాయి.

| ప్రత్యయం | ప్రయోగం |
|---|---|
| -తున్- / -టున్ | పాడైపోతుంది |
| | దొరుకుతుంది. |
| | ఉంటుంది |
| -తా- / -టా- | చూస్తాడు |
| | పంపిస్తాడు |
| | రాస్తాం |

చేస్తాం
ఉంటారు

'-తున్-/-టున్-' ప్రత్యయం స్థానంలో '-తా-/-టా-'లు పర్యాయ రూపాలతో ఉన్నాయి.

వస్తుంది / వస్తాది
పోతుంది / పోతాది

భూతకాల ప్రత్యయాలు :

1. '-ఇన్-' ప్రత్యయం మహదితర పురుష ప్రత్యయాల ముందు వాడుకలో ఉంది.

ఉదా॥

| | |
|---|---|
| తెచ్చింది | చెడిపోయింది |
| నవ్వింది | పెండ్లయింది |
| పుట్టింది | సచ్చిపోయింది |

2. '-ఏ- / -ఇనా-' ప్రత్యయాలు ఇతర పురుష ప్రత్యయాల ముందు వాడుకలో ఉన్నాయి. '-ఇనా-' ప్రత్యయం ఇక్కడి వ్యవహారంలో ఎక్కువగా వినిపిస్తుంది.

ఉదా॥

| | | |
|---|---|---|
| చెప్పేను | అడిగినాము | ఇచ్చినారు |
| చూసేను | అమ్మినాము | దిగినారు |
| రాసేను | చేసినాడు | తిరిగినాయి |
| అరిచేను | చదివినాడు | పోయినాయి |
| పెట్టేరు | | |
| చేయించేము | | |

3. '-న్నే- / -ఆ-' ప్రత్యయాలు నకారాంత ధాతువు తర్వాత భూతకాలంలో వాడుకలో ఉన్నాయి. '-న్నే-' ప్రత్యయం ఎక్కువగా కడప జిల్లా సమీపంలోని తాలూకాల వ్యవహర్తల వాడుకలో ఉంది.

| | |
|---|---|
| నిలబడున్నేది | ఉన్నాయి |
| పొడుపున్నేది | అన్నాడు |
| రాయున్నేది | విన్నాడు |
| ఏస్కున్నేము | తిన్నాడు |

'-న్నే-' ప్రత్యయం నకారాంతేతర ధాతువుల మీద చేరటం చాల తక్కువగా కనబడుతుంది

ఉదా॥ కొట్నేడు
పెట్నేడు

4. '-తి-/-టి-' ప్రత్యయాలు పై భూతకాలిక ప్రత్యయాలతో పాటు వాడుకలో ఉన్నాయి. ఈ ప్రత్యయాలు ఉత్తమ, మధ్యమ పురుషలకు ముందు వస్తాయి. ఉత్తమపురుష ఏకవచనములో పురుష ప్రత్యయం లేకుండా కూడా వాడినట్లున్న భూతకాల క్రియా రూపాలున్నాయి. కాని వాటి చివరి '-ని' అనే పురుష ప్రత్యయం లోపించిందని చెప్పవచ్చు.

ఉదా॥

-తి- -టి-

పోతిమి హొయ్యింటిమి
సూస్తిమి బూదిటిమి
తాగ్తిమి
ఎక్తిమి

ఉత్తమ పురుష ఏకవచనం లేకుండా వాడిన రూపాలు :

ఉదా॥

లేస్తి
సూపిస్తి
తీస్కుంటి
పండుకుంటి

-తి-' భూతకాల ప్రత్యయం ఉన్న రూపాలు చేస్తిమి వంటివి, ఇప్పటికీ కొన్ని మాండలికాలలో, ముఖ్యంగా తెలంగాణాలో వ్యవహారంలో ఉన్నట్లు శాసన భాషా పరిణామాన్ని చర్చిస్తూ పేర్కొన్నారు (రంగనాథాచార్యులు, కె. కె. తెలుగు భాషా చరిత్ర, 1979 పే. 1979) ఇప్పటి పరిశీలనలో ఈ రూపాలు రాయలసీమలో కూడా వాడుకలో ఉన్నట్లు తెలుస్తున్నది

5. ఈ జిల్లా వాడుకలో 'ఉండు' క్రియాప్రయోగంలో, భూతకాలంలో ఉండ్-ఎ/-ఇ-/ఉన్-నే-/ఉన్-ఇన్- అనే ప్రత్యయాలు వాడుకలో ఉన్నాయి.

| కర్నూలు | ఆ. ప్రా. భా. |
|---|---|
| ఉండె/ఉన్నేడు | ఉన్నాడు |
| ఉన్నింది | ఉన్నది |
| ఉన్నేయి/ఉన్నేరు/ఉండ్రి | ఉన్నారు. |

ఉండ్-ఎ ప్రథమపురుష ప్రత్యయాలముందు, ఉండ్-ఇ-ప్రథమపురుష బహువచన (మానవ) ప్రత్యయాల ముందు వస్తుంది. ఉన్-నే / ప్రథమపురుష మహదితర ఏకవచన ప్రత్యయాల ముందు తప్ప తక్కిన పురుష ప్రత్యయాల ముందు వస్తుంది.

6. -'ఎ'- ప్రత్యయం భూతకాలంలో ప్రథమపురుష ఏకవచన ప్రత్యయాల ముందు ప్రయోగించిన రూపాలు కూడా పుష్కలంగానే ఉన్నాయి.

ఉదా॥

పె

తి

సూసె
నిలబడె

'-ఇ-' ప్రత్యయం ప్రథమ బహువచన (మానవ) ప్రత్యయాల ముంపు వాడిన రూపాలు

పోడ్సిరి
ఏసిరి
వచ్చిరి

**ఉభయ ప్రార్థన :** '-దామ్' ప్రత్యయాన్ని ధాతువుకు చేర్చటం వల్ల ఈ రూపాలు ఏర్పడుతున్నాయి.

ఉదా॥

పోదాం
చదువుకుందాం
సినిమాచూద్దాం
సహకరిద్దాం
తీస్కపోదాం

## అసమాపక క్రియలు :

*శత్రర్థకం :* '-తు-/-టూ-, -తా-/-టా-' ప్రత్యయాలు విద్యావంతుల వాడుకలో ఉన్నాయి. ఒకే వ్యవహర్త పై రెండు రకాల ప్రత్యయాలను వాడిన సందర్భాలు ఉన్నాయి.

ఉదా॥

| -తూ- | -టూ- |
|---|---|
| అల్లుతూ | పాటలువింటూ |
| పంచుతూ | మున్నుకుంటూ |
| చూస్తూ | చల్లుకుంటూ |
| జరుగుతూ | అమ్ముకుంటూ. |

'--తా/-టా-' ప్రత్యయాలు వాడిన రూపాలు

ఉదా॥

| | |
|---|---|
| జార్తా | దొర్లుకుంటా |
| వస్తా, వస్తా | పొర్లుకుంటా. |

*క్త్వార్థకం:* '-ఇ' ప్రత్యయాన్ని ధాతువుకు చేర్చడం వల్ల క్త్వార్థకం ఏర్పడుతుంది. ఇక్కడి విద్యావంతుల వాడుకలో ఉన్న కొన్ని రూపాలు.

ఉదా॥

| | |
|---|---|
| చదివి | తిని |
| చూసి | తాగి |
| చేసి | తిప్పి |

*అప్యర్థకం:* '-(ఇ) నా' ప్రత్యయాలు ధాతువుకు చేరటం వల్ల అప్యర్థకం ఏర్పడుతున్నది.

ఉదా॥

| | |
|---|---|
| ఉద్యోగం చేసినా | అధికమాసొలొచ్చినా |
| ఏ మొచ్చినా | పెట్టినాగాని |
| అడిగినా | ఉన్నా |

*చేదర్థకం:* '-తే-' ప్రత్యయం ధాతువుకు చేర్చడం వల్ల చేదర్థకం ఏర్పడుతున్నది. ధాత్వంతం లోని అనునాసికం తరవాత ప్రత్యయ గతమైన 'త' కారం 'ట' కారమవుతుంది.

ఉదా॥

పిలిస్తే నిండితే
పోస్తే ఉంటే
చేయిస్తే
సహకరిస్తే

**తుమర్థకం** : ధాతువుకు '-అ' ప్రత్యయం చేర్చటం ద్వారా తుమర్థకం ఏర్పడుతున్నది. ఇది సాధారణంగా అస్వతంత్ర రూపమే (bound form).

ఉదా॥

విన్ > విన-
ఇచ్చ్ > ఇయ్య-/ఇవ్వ-
తిన్ > తిన-
ఉండ్ > ఉండ-

**తద్ధర్మవిశేషణం** : ధాతువుకు '-ఏ' ప్రత్యయం చేరటం వల్ల ఏర్పడుతున్నది.

ఉదా॥

రాసేదాన్ని
దున్నే భూములను
చదివే చదువులకు
చేసే ఉద్యోగాలకు

**క్త్వార్థకం** : ధాతువుకు '-ఇన' ప్రత్యయం చేరటంవల్ల ఏర్పడుతున్నది

ఉదా॥

కొట్టిన
పెట్టిన

**వర్తమానకాలిక ప్రత్యయం** : '-తున్నా-/-టున్నా' ప్రత్యయాలు వర్తమానాన్ని తెల్పుతున్నాయి.

ఉదా॥

చేస్తున్నాడు
చెప్తున్నాను
చదువుతున్నాడు
నేర్చుకుంటున్నాను
తిస్తున్నారు

'ఉండు' క్రియా ప్రయోగం వర్తమాన కాలంలో 'ఉండా,' పై పురుష బోధక ప్రత్యయాలు చేరి ఉండాడు, ఉండాయి మొదలైన రూపాలు ఏర్పడుతాయి.

## సంయుక్తక్రియలు :

క్రియ + అనుబంధక్రియ/సహాయక్రియ చేరిసంయుక్తక్రియలు ఏర్పడుతున్నాయి

ఉదా॥

తోడుపడు

తుడుటపడు
నిలబడు
పండబెట్టు
కల బెట్టు
నిల్చిపోవు
తెగిపోవు
కొట్టుకొను
అర్చుకొను
ఎడుకులాడు

## క్రియాపదబంధాలు :

నామం + క్రియ కలసి క్రియాపదబంధం ఏర్పడుతుంది.

ఉదా॥

పాపులర్ అవు
తయారవు
హీ చెక్క
బైస్కిలు కొట్టు
గబ్బులేపు
దెబ్బలాడు

## వ్యతిరేకార్థకాలు :

(1) '-అక, -అని' మొదలైనటువంటి వ్యతిరేక ప్రత్యయాలు చేరటం వల్ల వ్యతిరేకార్థకాలు ఏర్పడుతున్నాయి.

(2) రాదు, లేదు, వద్దు మొదలైన వ్యతిరేకార్థక సమాపక క్రియలు చేరటం వల్ల వ్యతిరేక నిర్మాణాలు ఏర్పడుతున్నాయి.

(1) వ్యతిరేక ప్రత్యయాలు చేరటం వల్ల ఏర్పడిన వ్యతిరేకార్థకాలు.

(i) ధాతువుకు -'అక' ప్రత్యయం చేరటంవల్ల వ్యతిరేకక్త్వార్థకం సాధించబడు తున్నది

ఉదా॥

దొరక్క
సచ్చక
జరపక
చెయ్యక
అరక్క

(ii) ధాతువుకు '-అని' చేరటం వల్ల వ్యతిరేక క్రియా విశేషణ రూపాలు ఏర్పడు తున్నాయి.

ఉదా॥

తినని

చెయ్యని
కానని
వినని

(iii) సమాపక క్రియాధాతువు వ్యతిరేక బోధక ప్రత్యయమైన '-అ-' చేరి దానికి పురుష ప్రత్యయాలు చేరటంవల్ల వ్యతిరేక తద్ధర్మార్థక క్రియలు ఏర్పడుతున్నాయి.

ఉదా॥

పెట్టను
పెట్టము
ఇయ్యను/ఇవ్వను
తినవు
చెయ్యవు

(iv) వీటిలో ఉత్తమ పురుష ఏకవచన బోధక ప్రత్యయం లేని రూపాలు కొన్ని వినిపించాయి.

ఉదా॥

విన (ను)
తిన (ను)
ఇయ్య(ను)

(v) ధాతువుకు -'అక / -ఆక' ప్రత్యయాలు చేరటం వల్ల వ్యతిరేక ప్రార్థనాద్యర్థక రూపాలు ఏర్పడుతున్నాయి.

ఉదా॥

రాయకండి / రాయాకండి
పెట్టకండి / పెట్టాకండి

(vi) ధాతువుకు -'అక' ప్రత్యయం చేరి దానిపై ఉండు, పోవు ధాతువుల చేదర్థక రూపాలు చేరటం వల్ల వ్యతిరేక చేదర్థక నిర్మాణాలు ఏర్పడుతున్నాయి.

ఉదా॥

| | |
|---|---|
| వినకుంటే | చెయ్యకపోతే |
| పిల్చకుంటే | పిల్చక పోతే |
| చెయ్యకుంటే | దున్నకపోతే |
| దున్నకుంటే | |

(vii) ధాతువుపై -'అక' ప్రత్యయం చేరి దానిపై పోవు, ఉండు ధాతువుల అప్యర్థకాలను అనుసంధించడం వల్ల వ్యతిరేక అప్యర్థక నిర్మాణాలు ఏర్పడుతున్నాయి.

ఉదా॥

| | |
|---|---|
| చదవకపోయినా | చదవకున్నా |
| పిల్చకపోయినా | తినకున్నా |
| దున్నక పోయినా | లేకున్నా |
| లేక పోయినా | |

(2) వ్యతిరేకార్థక సమాపక క్రియలు చేరటంవల్ల ఏర్పడుతున్న వ్యతిరేక నిర్మాణాలు.

(i) తుమర్థకానికి 'లేదు' అనే తద్ధర్మార్థక సమాపక క్రియ చేరడం వల్ల భూతకాల వ్యతిరేక నిర్మాణం ఏర్పడుతుంది.

ఉదా॥

మాట్లాడలేదు
తినలేదు
చూడలేదు

(ii) ప్రాంతీయతను తెల్పే భూతకాల వ్యతిరేక నిర్మాణం కర్నూలు, నందికొట్కూరు, ఆలూరు కేంద్రాల్లోని విద్యార్థుల వాడుకలో వినిపించాయి. క్త్వార్థక క్రియారూపానికి 'లేదు' చేరటం వల్ల ఏర్పడుతుంది. 'లేదు' లోని పురుష ప్రత్యయం లింగ, వచన భేదాన్ని బట్టి మారుతుంది. అందువలన వీటికి క్రియాస్వయం ఉంది.

ఉదా॥

| | |
|---|---|
| చెప్పిలేదు | 'చెప్పలేదు' |
| గెల్సిలేదు | 'గెల్సిలేదు' |
| ఇడ్సిలేదు | 'విడువలేదు' |
| వచ్చిలేదు | 'రాలేదు' |

(iii) భావార్థక రూపాలకు 'లేదు' చేరటం వల్ల వ్యతిరేక వర్తమానకాలిక నిర్మాణాలు ఏర్పడు తున్నాయి.

ఉదా॥

లెయ్‌డంలేదు
ఉండడంలేదు
వినడంలేదు.

(iv) 'లేదు' లోని పురుష ప్రత్యయం -'దు' లోపించి అక్షరాది 'ఏ' కారం 'ఐ' కారమై వాడుకలో ఉన్న వ్యతిరేక నిర్మాణాలు కూడా వినిపించాయి.

ఉదా॥

| | |
|---|---|
| మొల్చలై | పడడంలై |
| బతకలై | ఇయ్యడంలై |
| జరగలై | తినడంలై |

(v) తద్ధర్మవిశేషణానికి 'లేదు' చేర్చి వ్యతిరేకార్థకం సాధించటం కద్దు. ఇది ఇక్కడి వ్యవహారంలోని మరో ప్రత్యేకత.

ఉదా॥

| | |
|---|---|
| పిల్చిచ్చేలేదు | 'పిల్లు ఇవ్వడు' |
| అయ్యేలేదు | 'కాదు' |
| పిల్సే లేదు | 'పిలవము' |
| మోసే లేదు | 'మొయ్యము' |

(vi) 'కూడదు, ఒద్దు' వంటి సమాపక క్రియారూపాలు తుమర్థకానికి చేరటం వల్ల నిషేధార్థకాలు ఏర్పడు తున్నాయి.

ఉదా॥

ఉండపూడ అవొద్దు
చెయ్యగుడు గలాటపొద్దు
ఇయ్యగుద్ద తినొద్దు

(iii) 'లేదు' లోని పురుష ప్రత్యయం -'దు' లోపించి, అక్షరాది 'ఏ' కారం 'ఐ' కారమై వాడుకలో ఉన్న భూతకాల వ్యతిరేక నిర్మాణాలు వినిపించాయి

ఉదా॥

మొల్చలై
బతకలై
జరగలై

(iv) భావార్థక రూపాలను 'లేదు' చేరడంవల్ల వ్యతిరేక వర్తమానకాలిక నిర్మాణాలు ఏర్పడుతున్నాయి.

ఉదా॥

లేవడం లేదు పడతంలై
ఉండడం లేదు ఇయ్యతంలై
వినడం లేదు ఇనడంలై

## 2. నిరక్షరాస్యుల వ్యవహారం–కొన్ని విశేషాలు

### వర్ణవిభాగం :

పదాది అచ్చుల్లో వినిపించిన పర్యాయ రూపత

అ->ఒ : కొలుపులు (కలుపులు), పొసులు (పశువులు), మొకాన (ముఖాన), మొన్ను (మన్ను), మొగునొప్పు (మగనివాప్పు), సొద్దలు (సజ్జలు), దొంమకుంటాను (దంమకుంటాను), పొండ్లు (పండ్లు), మొందులు (మందులు), జోగాలు (జాగాలు), జొంపు (జంపు), మొబ్బున (మబ్బున), బొవిషత్ (భవిష్యత్తు). సొంతం (స్వంతం), సొగ్రామం (స్వగ్రామం).

ఎ->ఒ : రొండు (రెండు), రొడ్డిని (రెడ్డిని).

అ->ఎ : జెతకి (జతకు), గెనెము (గనిమ), గెడ్డి (గడ్డి), జెవారి (జవారి), బ్రెమ్మాండంగా (బ్రహ్మాండంగా).

ఏ->ఐ : చైత (చేత), లైకుంటే (లేకుంటే), మైత (మేత), నైల (నేల), మైళాలతో (మేళాలతో), సైపల్ (చేపలు), మైకల్ది (మేకలది).

ఏ->ఇ : మీమిద్దుడు (మేమిద్దరం), నీను (నేను).

అ->ఐ : మైబూనగర్ (మహబూబ్‌నగర్).

పద మధ్యాచ్చుల్లో పర్యాయ రూపత :

-అ->ఎ : కుటుంబెము (కుటుంబము), బాసెలు (భాషలు), ఉన్నెట్లు (ఉన్నట్లు), ఆందెము (ఆముదము).

-అ->ఇ : అంగిడికి (అంగడికి), ఒకిన్కేమో (ఒకనికేమో).

-ఆ->ఐ : నంద్యైల (నంద్యాల), దాన్నైలన్నీ (దాన్యాలన్నీ), మద్దైనం (మధ్యాహ్నం)

ఇ->-ఏ : దనేలు (ధనియాలు).

పదాద్యక్షరంలో వర్ణలోపం :

(i) పదాది సంయుక్తాక్షరంలో వకారలోపం :

వ->φ : యాపారం (వ్యాపారం).

(ii) పదాది 'వ' కార లోపం శిష్టేతరుల్లో కనిపిస్తున్నది :

వ->φ : ఎండి (వెండి), ఏనికి (వేనికి), ఇత్తుకుంట (విత్తుకుంట), యాలం (వేలం), ఏస్తరు (వేస్తరు), ఏపియ్యాల (వేపియ్యాల), యెనికి నుంచి (వెనకనుంచి), ఇనాయక (వినాయక), ఇనరు (వినరు)

(iii) పదాది 'హ' కార లోపం :

హ>φ : అరిజనవాడ (హరిజనవాడ), ఓసూల్లో (హోసూల్లో), ఓటలోల్లు (హోటలోల్లు)

(iv) పదమధ్యాక్షరంలో వర్ణలోపం :

(i) పద మధ్య 'వ' కార లోపం:

-వ->φ : సోమారం (సోమవారం)
బుదారం (బుధవారం)
మంగ్యారం (మంగళవారం)

(ii) పద మధ్య 'హ' కార లోపం :

-హ- > φ : సాయము (సహాయము), మూర్తం (ముహూర్తం)

(iii) పదమధ్య 'య' కార లోపం :

-య- > φ : బీము (బియ్యము).

పదమధ్య వర్ణాల్లో పర్యాయ రూపత :

-హ- > గ : ఆగతి (ఆహుతి).
-హ- > బ : సింబము (సింహము)
-వ- > గ : ఉత్సోగం (ఉత్సవం).
-వ- > మ : బగ్మంతుని (భగవంతుని).
-వ- > య : సాయలేదంటే (చావలేదంటే)
-య- > స : దైర్నం (ధైర్యం).
-ల- > న : పొట్నాలు (పొట్లాలు).
-ట- > త : తమేట (టమోటా)
-న- > ల : సిల్మా (సినిమా)
-గ- > క : పొకుర్లే (పొగరు లేదు), రంకల్ రాటాలు (రంగులరాట్నాలు)

పదాంత వర్ణాల్లో పర్యాయ రూపత :

-వ- > గ : తాగి (త్రవ్వి)
-ర- > ల : దలాలీ (దళారీ)

శ్వాస స్పర్శాలను నాద స్పర్శాలుగా పలికిన రూపాలు :

-క- > గ : కొబ్బెర (గొబ్బెర), గొట్టాము (కొట్టాము), గాలిపొయ్యి (కాలి పొయ్యి).

-చ- > జ : జొల్లితే (చల్లితే)

-ప- > బ : బుట్నేవా (పుట్టినావా), బేర్చి (పేర్చి)

బొయ్యె (పోయినాడు)

పదాది 'చ' కారం 'స' కారం అయిన రూపాలు :

చ->స : సీకట్లో (చీకట్లో), సేతికొచ్చిరి (చేతి కొచ్చిరి), సెమ్మ (చెంబు), సింత కాయలు (చింతకాయలు), సాల్లు (చాళ్ళు), సెట్టు (చెట్టు), సీరలు (చీరలు), సలి (చలి), సదువు (చదువు), సిలక (చిలక), సొప్ప (చొప్ప)

మూర్ధన్యాలు దంత మూలీయాలు కావడం వీరి వాడుకలో ఎక్కువగా ఉంది. కొందరిలో మాత్రం ఈ భేదం నిలిచి ఉంది.

-ళ>ల : సీల్లు (సీళ్లు), వాల్లు (వాళ్లు), రాల్లు (రాళ్ల) కాల్లు (కాళ్లు).

-ణ>న : వీన్ని (వీణ్ణి), వాన్ని (వాణ్ణి).

***మహాప్రాణత్వ లోపం :***

మహాప్రాణోచ్చారణ వీరి వాడుకలో లేనట్లు తెలుస్తున్నది.

ఉదా॥ దర (ధర), బూమి (భూమి), చార్జి (ఛార్జి), సుకం (సుఖం), కర్చు (ఖర్చు), బార్య (భార్య).

'శ' కార 'ష' కారాలను కొన్నిసార్లు 'స' గాను కొన్నిసార్లు 'సె' గాను ఉచ్చరించినారు.

శ>స/సె పసులు (పశువులు), ఈసుర్ని (ఈశ్వరుని), దసరా (దశరా), సివరాత్రి (శివరాత్రి). వంసెము (వంశము), సస్నెం (నశ్యం).

ష>స/సె వర్సం (వర్షం). వేస్కాల్ (వేషాలు), సావుకారి (షాహుకార్), సోడా సీసాలు (షోడాసీసాలు), బాసెలు (భాషలు).

ఇక్కడి నిరక్షరాస్యుల వ్యావహారికంలో కిందివిధమైన వర్ణ సమీకృత రూపాలు వినిపించాయి.

| పదం | వ్యావహారికం | సమీకృతం |
|---|---|---|
| సత్యం | సత్తెం | త్య > త్తె |
| మధ్యన | మ న | ధ్య > |
| సేద్యం | సే ం | ద్య > |
| మధ్యాహ్నం | మ నం | ధ్యా > |
| లక్షణంగా | ల చ్చనెంగా | క్ష > చ |
| పరీక్ష | పరీచ్చ | క్ష > చ్చ |
| ఉద్యోగస్తులు | ఉద్దోగస్నులు | ద్యో > ద్దో |
| ఇస్తావా | ఇస్నావా | స్తా > స్నా |
| కర్పూరం | కప్పురం | ర్పూ > ప్పు |
| తిర్నాల | తిన్నాల | ర్నా > న్నా |

***వర్ణ అసంయుక్తత*** : పదమధ్య సంయుక్తవర్ణాన్ని అసంయుక్తం చేసి పలికిన రూపం.

ఉదా॥ తలంబ్రాలు > తలుబాలు

***స్వరభక్తి*** : సంయుక్తాక్షరం మధ్య ఒక అచ్చు అదనంగా వచ్చి చేరినట్లైతే దాని స్వర భక్తి అంటారు. ఇక్కడి వాడుకలోని రూపాలు.

ఉదా॥

సంక్రాంతి > సంకురాత్రి
నిద్రలు > నిద్దర్లు

**వర్ణవ్యత్యయం** చెందిన రూపాలు కొన్ని మాత్రమే వినిపించాయి.

ఉదా॥

ఊ్రలో < ఊర్లో
బుగులు < గుబులు
చమరం < చర్మం

నిత్యం వాడుకలో ఎదురయ్యే కొన్ని క్లిష్టమైన ఇంగ్లీషు పదాలను సులభతరంగా చేసి ఉచ్చరించడం కానీ, వేరే విధంగా ఉచ్చరించడం కాని వీరి వ్యావహారికంలో వినిపిస్తుంది

| పలికిన తీరు | ఇంగ్లీషు పదం |
|---|---|
| ఊరియా | Urea |
| గమీషన్ | Gamaxin |
| టెల్లిన్ | Terlin |
| డాకటేరు | Doctor |
| ఎతాట్రు | Head-master |
| మన్నే | Money-order |
| కాంప్లెషను | Complex |

*పదాంశవిభాగం* :

నిరక్షరాస్యుల్లో పదాంశ విభాగానికి సంబంధించిన కొన్ని ముఖ్యమైన విషయాలు మాత్రమే ప్రస్తావించడమైంది.

**నామపదవిభాగం** : విద్యావంతుల వాడుకలో బహువచన ప్రత్యయమైన '-లు' ఏకవచనంలో చేరినప్పుడు కొన్ని మార్పులు జరిగి చివరి అచ్చుకు ముందున్న 'ల' కారం మూర్ధన్యమవడం కొన్ని శబ్దాల్లో జరుగుతుంది. కానీనిరక్షరాస్యుల్లో మూర్ధన్య 'ళ' కార లోపం ఎక్కువగా ఉన్నందువల్ల, 'ల' కారం ఉన్న రూపాలు వినిపించాయి.

ఉదా॥

కాలు + లు > కాల్ + లు > కాల్లు
సోల + లు > సోల్ + లు > సోల్లు

**విభక్తి ప్రత్యయాలు** :

-కి : అకారాంత శబ్దాల చివర కూడా '-కి' విభక్తిని చతుర్థీ విభక్త్యర్థంలో వాడడం వీరిలో గమనించవచ్చు.

ఉదా॥ మాకి (మాకు), మానాయనకి (మా నాయనకు),
మా అత్తకి (మా అత్తకు)

-ముంటి : అపాదానకారకార్థంలో వాడడమైంది.

ఉదా॥ దబ్బులొచ్చేలముంటి (డబ్బులు వచ్చినప్పటి నుంచి)

*నామప్రత్యయాలు* :

-అంచన : సమీపార్థకంలో వాడడం వీరిలో వినిపించింది.

ఉదా॥ మనంచన (మనదగ్గర)

రైతులంచన (రైతులదగ్గర)

-దాకా /-దాంకా : ప్రత్యయాన్ని నిర్ణీత సమయార్థకంలో వాడినారు.

ఉదా॥

ఐదు గంటల దాకా

ఐద్రోజుల దాంకా

-ముంచెల : అభి ముఖార్థంలో

ఉదా॥

దసరా ముంచెల

ప్రశ్నార్థకాలలో 'ఎ / ఏ' కి బదులుగా 'యా' ని ఎక్కువగా వాడుతున్నారు.

ఉదా॥

యాటికి 'ఎక్కడికి'
యాడిది 'ఎక్కడిది'
యాడ 'ఎక్కడ'
యాదప్పా 'ఏదప్పా'

క్రియావిభాగం :

క్రియా ప్రయోగాలకు సంబంధించి కొన్ని ముఖ్యమైన విశేషాలు. ప్రార్థనార్థక బహువచన రూపంలో -్రి (<'ండి') వినిపిస్తుంది.

ఉదా॥

తిన్రి
పొండ్రి
ఇడ్సిపెట్ట్రి

వ్యతిరేక ప్రార్థనార్థక బహువచనంలో తుమర్థక రూపానికి -వాక- ప్రత్యయం చేరుతున్నది.

ఉదా॥

పొండవాక్రి
తినవాక్రి

తద్ధర్మార్థకరూపం :

వీరి వాడుకలో '-తా- / -టా-' ప్రత్యయాలతో పాటు వీటి హ్రస్వరూపాలు -త- / -ట- లు కూడా పర్యాయోపయోగంలో ఉన్నాయి.

| -తా- | -టా- | -త- | -ట- |
|---|---|---|---|
| కొడ్తారు | ఉంటాంది | పోతది | ఉంటది |
| ఇస్తారు | తింటాము | అడుగుతం | |
| పోతాము | | పన్జేస్తము | |
| కట్తారు | | | |
| వాడ్తాము | | | |

భూతకాల ప్రత్యయాలు :

నిరక్షరాస్యుల్లో ఒకరిద్దరిలో తప్ప తక్కినవారి వాడుకలో భూతకాల ప్రత్యయం'ఏ' వినిపించదు. ఎక్కువగా '-ఇనా-', '-న్నే-' '-ఏ' ప్రత్యయాలు వాడుకలో ఉన్నాయి.

(i) -ఇనా- ప్రత్యయం వాడిన రూపాలు.

ఉదా॥

పొయినారు
సదివిచ్చినారు
బూమిచ్చినారు
దీర్పొయినాడు

(ii) -న్నే- ప్రత్యయం వాడిన రూపాలు

ఉదా॥

పుట్నేరు
జేసుకున్నేము
తీస్కున్నేము

(iii) -ఏ ప్రత్యయం వాడిన రూపాలు

ఉదా॥

బట్కొనుండ్రే
గింజలొస్తుండ్రే
చేసిచ్చె
పంపిచ్చె

పురుష ప్రత్యయాలు :

ప్రథమ పురుష బహువచన మానవేతర ప్రత్యయం '-యి' తో పాటు -'వి కూడా వీరి వాడుకలో ఉంది.

ఉదా॥

| | |
|---|---|
| గాలిపోతయి | అయిపోతావి |
| పండ్తాయి | పైర్లు ఎండిపోతవి |
| | పండ్తావి |
| | కులాలుండావి |
| | గాలిపోతవి |

## 3. కర్నూలు మాండలికం—సామాన్య లక్షణాలు

కన్నడ భాషా ప్రభావం కర్ణాటక రాష్ట్రానికి సమీపాన ఉన్న కేంద్రాలలో(ఆదోని ఆలూరు, ఎమ్మిగనూరు) ఎక్కువగా కనిపిస్తుంది. ఒక్కొక్కప్పుడు సగం కన్నడ, సగం తెలుగు పదాలను వాడుతుంటారు. కింది ఉదాహరణలను గమనిస్తే విశదమవుతుంది.

1.) సగం కన్నడం, సగం తెలుగు కలిపి వాడుతున్న పదజాలం :

ఉదా॥ కన్నడం — తెలుగు

| | | | | |
|---|---|---|---|---|
| బాళేపండు | 'అరటిపండు' | బాళే | — | పండు |
| గొడ్డుము | 'ఎరువు, పేడ' | గొబ్బ | — | ము |
| బీగుడు | 'వియ్యంకుడు' | బీగ | — | డు |
| బీగురాలు | 'వియ్యంకురాలు' | బీగ | — | ఆలు |

2.) గొత్తు 'తెల్సు', జగ్గి 'గట్టిగా' వంటి కన్నడ పదాలను యథాతథంగా వాడడం జరిగింది.

3.) ఉత్తర మండల ప్రభావంకూడా ఈ జిల్లా భాషపై ఉందని చెప్పటానికి కొన్ని పదాలు, వ్యాకరణ విశేషాలు తోడ్పడుతాయి.

(a) ఉదా॥

లేపు 'పరుపు'
ఊకే 'ఊరకనే'
ఊసిపోతాయి 'ఊడిపోతాయి'
యాసిరిక 'విసుగు'

(b) ప్రార్థనాద్యర్థక -ర్రి

ఉదా॥

అమ్మర్రి 'అమ్మండి'
తినర్రి 'తినండి'

(c) భూతకాల వ్యతిరేక క్రియలు :

ఉదా॥

వచ్చిలేడు 'రాలేదు'
చేసిలేడు 'చెయ్యలేదు'
పిల్చిలేడు 'పిల్వలేదు'
చెప్పిలేరు 'చెప్పలేము'

4.) అలాగే ఉర్దూ భాషా ప్రభావం ఇక్కడి భాషపై కనిపిస్తున్నది.

ఉదా॥

తల్లెలు/తల్లీలు (<ఉర్దూథాల్) 'పళ్ళేలు'
అవుతుకాన (<ఉర్దూహౌజ్) 'నీళ్ళతొట్టి'
పొట్టెగాడు (<ఉర్దూపొట్ట) 'పిల్లవాడు'

5 ) మూర్ధన్యవర్ణమైన 'ట'కార స్థానంలో దంత్యవర్ణమైన 'త'కారాన్ని వాడడం గమనించవచ్చు.

ఉదా॥

అంకెలేసేతప్పుడు 'అంకెలేసేటప్పుడు'
రాసేతప్పుడు 'రాసేటప్పుడు'
తీస్కునేతప్పుడు 'తీస్కునేటప్పుడు'

6.) సహచారి సంబంధ కారకంలో '-తన/-తోటి' ప్రత్యయాలు వాడుక ఎక్కువగా

వినిపిస్తుంది.

ఉదా॥

కర్నూల్లోన నాతోటి
బెల్లంతోన దావల్లోటి

7) అభ్యంతరార్ధకంలో -'లోన' ప్రత్యయం వాడుక సాధారణంగా వినిపిస్తుంటుంది.

ఉదా॥

ఆడొన్లోన
కాలేజిలోన
పాలడబ్బుల్లోన

8.) ఉపర్యర్థకంలో ప్రాచీన రూపంలోని సవర్ణధ్వని వినిపిస్తుంది.

ఉదా॥

కొండమింద
దానిమింద
మామిందికి

9 ) తుమర్థరూపానికి -'నీకి' చేరడం వల్ల చతుర్థీ విభక్త్యర్థం వస్తున్నది. ఇటువంటి రూపం ఈ జిల్లాలో ఎక్కువగా వినిపిస్తుంది.

ఉదా॥

| | | | |
|---|---|---|---|
| తిననీకి | 'తినటానికి' | పిల్చనీకి | 'పిల్చటానికి' |
| తాగనీకి | 'తాగటానికి' | ఇయ్యనీకి | 'ఇవ్వటానికి' |
| కొట్టనీకి | 'కొట్టటానికి' | | |

10.) 'లెక్క' ను తులనార్థకంలో ప్రయోగించడం గమనించవచ్చు.

ఉదా॥

ఎద్దులెక్కుండె 'ఎద్దులాగ ఉన్నది'
వానిలెక్క 'వానిలాగ'

11) వ్యతిరేకక్త్వార్థక రూపానికి '-గా' ప్రత్యయం చేరడం వల్ల అవ్యయాలు ఏర్పడుతున్నాయి.

ఉదా॥

| | |
|---|---|
| ఒక్కాపి తాక్కుండగా | 'ఒక కాఫ్ఫీ తాగకుండా' |
| ఒక బీడీ తాక్కుండగా | 'ఒక బీడీ తాగకుండా' |
| సారాయి తాక్కుండగా | 'సారాయి తాగకుండా' |

12) తోలుకొనివచ్చు రూపం పశుపక్ష్యాదులకు పరిమితమై ఉండగా వాడుకలో మనుష్య పరంగా వాడడం గమనించవచ్చు. ఇదే ఉత్తరమండల ప్రభావం వల్లనే కావచ్చు.

ఉదా॥

| | |
|---|---|
| ఆడపిల్లల్ను దోల్కొచ్చుకుంటాం | 'ఆడపిల్లల్ను పిల్చుకొనివస్తాం' |
| పెండ్లాన్ని తోల్కపోడు | 'భార్యను పిల్చుకొని వెళ్ళడు' |
| పెండ్లికూతుర్ను తోలకొచ్చేది | 'పెండ్లికూతుర్ను తీసుకురావటం |

13) 'పాడైపోవు' అనే అర్థంలో 'గబ్బులేసిపోవు' అనే పదబంధం ఇక్కడివాడు వినిపిస్తుంది

ఉదా॥

ఎనిమిదిలో స్టార్టు చేస్తేగిన్క గబ్బులేసి పోతాది.

14) 'అప్పు తీర్చడం' అనటాన్ని 'అప్పు దుద్దడం' అని అంటారు.

15) 'గొంచకపోతాం' 'కొండపోతాం' అనే రూపాలను ఈ జిల్లాలో 'తీసుకొనిపోత' అనే అర్థంలో వాడుతుంటారు.

ఉదా॥

మేమే అన్నం గొంచక పోతాము.

16) 'గిన్క' (<గనుక <కనుక) అనే అవ్యయం ఇక్కడి వాడుకలో ఎక్కువ వినిపిస్తుంది.

ఉదా॥

రాస్తావంటేగిన్క
వేస్కుంటేగిన్క
తెల్సుకోవాలంటేగిన్క

17) కిలార్థంలో 'అందు' ప్రయోగం వినిపిస్తుంది.

ఉదా॥ కాళ్ళ జార్తాఅందు
దోశఅందు

కర్నూలుజిల్లా మాండలికాన్ని ప్రతిబింబించే కొన్ని మాండలిక పదాలు ఉదాహరణకు కింద ఇవ్వడం జరిగింది.

| కర్నూలు మాండలికం | | ప్రామాణికభాష |
|---|---|---|
| అంగి | — | చొక్కా |
| ఇగ్గు | — | లాగు |
| ఈలకత్తి | — | కత్తిపీట |
| ఎగపోర్సి | — | ఉసికొల్పి |
| ఎనుముగొడ్లు/బరెగొడ్లు | — | బర్రెలు |
| ఎచ్చులు | — | కోతలు,డంబాలు |
| ఒట్టిగడ్డి | — | ఎండుగడ్డి |
| ఒట్టి మిరపకాయలు | — | ఎండుమిరపకాయలు |
| కరెంటు బుడ్డి | — | బల్బు |
| కాళ్ళ తీపులు | — | కాళ్ళునొప్పులు |
| కుడుములు | — | ఉండ్రాళ్ళు |
| కొండబొయినా | — | తీసుకొని వెళ్ళినా |
| గలాబ/గలాట | — | అల్లరి |
| గాజ | — | గాదె |

| | | |
|---|---|---|
| గాసం | — | జీతం |
| గాసగాడు | — | జీతగాడు |
| గిల్లెలు | — | చాడీలు |
| గులిగెలు | — | మాత్రలు (Tablets) |
| గేరి | — | వీధి |
| చిత్తి | -- | సంచి, తిత్తి |
| చిలకం | — | తిలకం |
| జంపు | — | పొదవు |
| తల్లె | — | పళ్ళెం |
| తరంగావు | — | పనికిరావు |
| తిరగరోజు | — | మరుసటిరోజు |
| దుడ్డు | — | డబ్బు |
| పాగడా | — | లంగా |
| పొట్టిగాడు | — | పిల్లవాడు |
| బాళెపండు | — | అరటిపండు |
| బిడ్డ | — | కూతురు |
| బుడుకు | — | వెదకు |
| బు | — | కూజా |
| బు  లు | — | వేరుశనగకాయలు |
| మ కి లేక | — | జ్ఞాపకం లేక |
| మాపిడింతల | — | సాయంత్రం |
| మిచ్చెన | — | నిచ్చెన |
| మోటోల్లు | --- | మొరటువాళ్ళు (చదువు రానివారు) |
| యాసిరిక | — | విసుగు |
| సిబ్బిరేకు | — | మూత |

ఈ వ్యాసంలో కర్నూలు జిల్లా మాండలిక వ్యావహారికంలోని వివిధ భాషా విషయాలు క్లుప్తంగా చర్చించడం జరిగింది. ఈ జిల్లాలోని విద్యావంతుల వ్యవహారంలో ప్రామాణిక భాషా ప్రభావం కనిపిస్తున్నది. వీరు ప్రాంతీయ ప్రయోగాలనే కాకుండా ప్రామాణిక భాషా ప్రయోగాలను కూడా సొంతం చేసుకొని వాడుతున్నట్లు తెలుస్తున్నది. కర్ణాటక రాష్ట్రానికి సమీపవర్తులైన ఈ జిల్లాలోని తాలూకాల్లో కన్నడ ప్రభావం ఉంది. ప్రాచీన భాషా ప్రయోగాలు కర్నూలు జిల్లా వ్యవహారంలో విరివిగా ఉన్నాయి.

## 4. కర్నూలు మాండలికం—ఆధునిక తెలుగు ప్రామాణిక భాష

తెలుగు భాష రాష్ట్రమంతటా వ్యవహారంలో ఉన్నప్పటికీ అందులో సామ్యాలతో పాటు వైవిధ్యాలుకూడా ఉన్నాయి. వైవిధ్యాల దృష్ట్యా రాష్ట్రాన్ని నాలుగు మండలాలుగా విభజించడమైంది. 1. మధ్యమండలం 2. తూర్పుమండలం 3. ఉత్తరమండలం 4. దక్షిణ

మండలం. కర్నూలుజిల్లా దక్షిణమండలానికి చెందుతుంది. మధ్యమండలం (ఉభయ గోదావరులు, గుంటూరు, కృష్ణాజిల్లాలు) విద్యావంతుల వ్యావహారికాన్ని ఆధునిక తెలుగు ప్రామాణికంగా చాలామంది భాషాశాస్త్రవేత్తలు అంగీకరిస్తున్నారు. ప్రామాణిక భాషకు కర్నూలు జిల్లాలోని భాషకు మధ్యగల సామ్యవైవిధ్యాలను స్థూలంగా కింది పట్టికద్వారా గుర్తించవచ్చు.

| అంశం | కర్నూలు మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|
| 1) అచ్చులు | ఏ | ఏ |
| 2) హల్లులు | | |
| i) అనునాసికాలు | న, ణ | న, ణ |
| ii) పార్శ్వికాలు | ల, ళ | ల, ళ |
| iii) ఊష్మాలు | శ,ష | శ, ష |
| iv) మహాప్రాణధ్వనులు | ఉన్నాయి | ఉన్నాయి. |
| 3) *పదాంశవిభాగం* | | |
| *నామవిభాగం* | | |
| 1) బహువచన ప్రత్యయం | లు (లు రూళు) | లు (లురూ ళు) |
| i) చాలు, కాయు, మెయు కోడి, తడి, నెమలి మొసలి, కుందేలి | ల్ + లు > ళ్లు | ల్ + లు > ళ్లు |
| ii) బండి, పండు, కొడవలి గొడ్డలి, ఇల్లు, ముల్లు పన్ను | ండ్ + లు > ండ్లు | ల్ + లు > ళ్లు |
| iii) గోరు, నోరు, పేరు | ర్ + లు > ర్లు | ల్ + లు > ళు |
| iv) చేను, పేను | ф + లు > లు/ న్ + లు > న్లు | ф + లు > లు |
| నామ ప్రత్యయాలు : | | |
| i) ద్వితీయా విభక్తి | -ని/-ను | -ని/-ను |
| ii) సహచారి సంబంధ కారకం | -తో/-తోన/-తోని/ -తోటి(గ) | -తో |
| iii) చతుర్థీ విభక్తి | -కి/-కు | -కి /-కు |
| iv) అభ్యంతరార్థకాలు | -లో/-లోపల/-లోన | -లో |
| v) అపాదాన కారకాలు | -నించి/-నుంచి/-నుండి/ -నుంటి/-ముంటి | -నించి |
| vi) ఉపర్యర్థకాలు | -మీద/-మింద/-పైన/ -మీన | -మీద |
| vii) అవధ్యర్థకాలు | -దాకా/-దాంకా | -దాక |
| viii) సమీపార్థకాలు | -దగ్గర/-దగ్గిర/-కాడ/ | -దగ్గర |

| అంశం | | కర్నూలు మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|---|
| | | -తాన/-వద్ద | |
| ix) నిమిత్తార్థకాలు | | -కోసం/-కొరకు | -కోసం |
| x) నిర్ణీతసమయార్థకం | | -వరకు | |
| వర్ణసమీకృతరూపాలు: | | | |
| | | -జ్య- > : రా ం | రాజ్జెం |
| | | -ధ్య- > : మ | మజ్జెన |
| | | -ఖ్య- > :ము మైన | ముఖ్యమైన |
| | | -క్ష- > చ్చ:లచ్చ | లక్ష |
| | | -ద్యో- > ద్దో:ఉద్దోగం | ఉజ్జోగం |
| వర్ణపరిణామం: | | | |
| | | పొప్పన్నం, సొద్దలు | పప్పన్నం, సజ్జలు |
| | | మొబ్బు | మబ్బు |
| | | మ్యేకపోతు, మ్యేళం | మేకపోతు, మేళం |
| | | రొండు | రెండు |
| | | గాజ | గాదె |
| | | రేగిపండ్లు | రేణిపండ్లు |
| | | రాసేతప్పుడు | రాసేటప్పుడు |
| సంఖ్యలు | | | |
| | | పదహైదు/పదైదు | పదిహేను |
| | | పజ్జెనిమిది | పద్దెనిమిది |
| | | ఇన్నూరు | రెండువందలు |
| | | మున్నూరు | మూడువందలు |
| భావార్థకప్రత్యయం: | | -అటం/-అడం | అటం |
| ప్రయోజనార్థకప్రత్యయం: | | -నీకి/-అటానికి/-అడానికి | -అటానికి |
| 4) క్రియావిభాగం: | | | |
| భూతకాలికప్రత్యయాలు: | | | |
| ఉత్తమ | | -ఏ-/-ఇనా-/-నే-(-న- | -ఏ-/-నా-(-న- |
| మధ్యమ | | ,, | ,, |
| | మహత్ | -ఏ-/-నా-(న-; | -ఏ-/-నా- |
| ప్రథమ | | -ఇనా-/-నే-(-న-:-ఎ | |
| ఏక | మహదితర | -ఇన్-/-న-,-ఎ | -ఇన్-/-న- |
| ప్రథమ | మానవ | -ఏ- | -ఏ-/-న- |
| బహు | | | |
| | మానవేతర | -ఇనా-/-ఎ | -ఇన-/--న- |
| తద్ధర్మార్థకప్రత్యయం: | | | |
| ఉత్తమ | | -తా-/-త-;-టా-/-ట- | -తా-/-టా- |
| మధ్యమ | | ,, ,, | ,, |

| అంశం | కర్నూలు మాండలికం | ఆధునిక ప్రామాణిక భాష |
| --- | --- | --- |
| మహత్ | " " | " |
| ప్రథమ ఏక మహదితర | -తున్-/-టున్-<br>-తా-/టా | -తున్-/-టున్- |
| మానవ | -తా-/-టా- | -తా-/-టా- |
| ప్రథమబహు మానవేతర | -తా-/-టా- | -త-/-ట- |
| వర్తమానకాలిక ప్రత్యయం: | | |
| ఉత్తమ | -తున్నా-/-టునా-/<br>-తుండా-/-టుండా- | -తున్నా-/-టున్నా- |
| మధ్యమ | ,, | " |
| ప్రథమ మహత్ | -తున్న-/-టున్న-/<br>-తుండా-/-టుండా- | -తున్నా-/-టున్నా- |
| మహదితర | -తున్న-/-టున్న-/<br>-తుండా-/-టుండా- | -తున్న-/-టున్న- |
| సామర్థ్యార్థకం | తుమర్థం + గల/<br>తద్ధర్మార్థకరూపం | తుమర్థం + గల |
| నిశ్చయార్థకం: | -ఆల/-ఆలె/ఆలి | -ఆలి |
| శత్రర్థకం | -తూ/-టూ<br>-తా/-టా | -తూ/-టూ |
| తద్ధర్మవిశేషణం: | -ఏ | -ఏ |
| చేదర్థకం | -తే/-టే | -తే/-టే |
| ఉభయసంప్రార్థనాద్యర్థకం: | -దామ్/-తామ్ | -దామ్ |
| క్త్వా కం : | -ఇ | -ఇ |
| అప్య కం : | -(ఇ)నా | -(ఇ)నా |
| తుమ కం : | -అ | -అ |
| క్త వ కం | -ఇన | -ఇన |
| వ్యతి కక్త్వార్థకం : | ధాతువు + అక | ధాతువు + అక |
| వ్యతిరేక క్రియావిశేషణం : | ,, + అని | " + అని |
| వ్యతిరేక తద్ధర్మార్థకం : | ,, + అ + పురుష ప్రత్యయాలు | " + అ + పురుష ప్రత్యయాలు |
| వ్యతిరేక ప్రార్థనాద్యర్థకం : | ,, + అక/అక + గౌరవార్థకం | ,, + అక + గౌరవార్థకం |
| వ్యతిరేక చేదర్థక నిర్మాణాలు: | ,, + అక + ఉండు/ పోవు చేదర్థక రూపాలు | ,, + అక + పోవుచేదర్థక రూపం |
| వ్యతిరేక అప్యర్థక నిర్మాణాలు : | ,, + అక + ఉండు/ పోవు అప్యర్థక రూపాలు | ,, + అక + పోవు అప్యర్థక రూపం |

| అంశం | కర్నూలు మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|
| వ్యతిరేక భూతకాల నిర్మాణాలు : | తుమర్థకం + లేదు/లే, క్త్వార్థకం + లే + పురుష ప్రత్యయం | తుమర్థకం + లేదు |
| వ్యతిరేక వర్తమానకాలిక నిర్మాణం : | భావార్థకం + లేదు/లే | భావార్థకం + లేదు |
| నిషేధార్థకం : | తుమర్థకం + కూడదు/ ఒద్దు | [illegible] |
| బహువచన ప్రార్థనాద్యర్థకం: | -రి/-అండి | -అండి |
| సంబోధనార్థకాలు. | ఏమండి | ఏమండి |
| | ఏమప్పా/ఏంపయ్యా/ ఏమయ్యా | ఏమయ్యా |
| | ఇలే/ఒరే | ఒరే |
| బాంధవ్యబోధక పదాలు : | | |
| తండ్రి | నాయ్న/అయ్య/నాన్న | నాన్న |
| త తల్లి | అవ్వ | అమ్మమ్మ |
| త తండ్రి | తాత | తాత |
| త అక్క | పెద్దమ్మ | ఆమ్మ |
| త చెల్లెలు | చిన్నమ్మ, పిన్ని | పిన్ని |
| త సోదరుడు | మేనమామ | మేనమామ |
| మేనమామ భార్య | అత్త | అత్త |
| తండ్రి తల్లి | జేజి/జేజమ్మ/అవ్వ | నాయ్నమ్మ/బామ్మ |
| తండ్రి తండ్రి | జేజినాయ్న/జేజబ్బ/అబ్బ | తాతయ్య |
| తండ్రి అన్న | పెద్నాయ్న/పెద్దయ్య/ పెద్దప్ప | పెదనాన్న |
| తండ్రి తమ్ముడు | చిన్నాయ్న/చిన్నయ్య/ చిన్నప్ప | చిన్నాన్న |
| తండ్రి సోదరి | అత్త | అత్తయ్య |
| మేనత్త భర్త | మామ | మామయ్య |
| భార్య | భార్య/పెండ్లాము | భార్య/మాఆవిడ |
| భర్త | భర్త/మొగుడు/మాఆయన | భర్త/మావారు |
| భార్యసోదరుడు | బామర్ది | బావమర్ది |
| భార్య అక్క | వదిన | వదిన |
| భార్య చెల్లెలు | మర్దలు | మర్దలు |
| భార్య/భర్త తండ్రి | మామ | మామగారు |
| భార్య/భర్త తల్లి | అత్త | అత్తయ్య |
| భర్తఅన్న | బావ | బావగారు |
| భర్తతమ్ముడు | మర్ది | మరిది |
| భర్తసోదరి | ఆడబిడ్డ/వదినమర్దలు | ఆడబిడ్డ |

| అంశం | కర్నూలు మాండలికం | ఆధునిక ప్రామాణిక భాష |
|---|---|---|
| భర్త సోదరుని భార్య | తోడికోడలు/యారాలు | తోడికోడలు |
| భార్య సోదరి భర్త | షడ్డకుడు/సడ్డకుడు/షడ్రకుడు/తోడల్లుడు | తోడల్లుడు/షడ్డకుడు |
| అక్క | అక్క | అక్కయ్య |
| అన్న | అన్న | అన్నయ్య |
| చెల్లెలు | చెల్లెలు | చెల్లెలు |
| కూతురు | బిడ్డ/కూతురు | కూతురు |
| కూతురు/కొడుకు మామగారు | వియ్యంకుడు/బీగుడు | వియ్యంకుడు |
| కూతురు/కొడుకు అత్తగారు | వియ్యంకురాలు/వియ్యపురాలు/బీగురాలు | వియ్యపురాలు |
| *సోదరి కుమారుడు | మేనల్లుడు | మేనల్లుడు |
| *సోదరి కుమార్తె | మేనకోడలు | మేనకోడలు |

## 5. పదజాలం-కొన్ని విశేషాలు

మాండలికాలను చెప్పటానికి తోడ్పడే అంశాల్లో పదజాలం కూడా ముఖ్యమైన పాత్ర వహిస్తుంది. కేవలం వ్యాకరణ విశేషాల వల్లనే కాకుండా ఉపయోగించే పదాలవల్ల కూడా అది ఏ ప్రాంతం వాడుకలోదో ఉజ్జాయింపుగా చెప్పవచ్చు. కొన్ని మాండలిక పదాలు కేవలం ఆ ప్రాంతం వరకే పరిమితమై తమ ప్రత్యేకతను తెలియ జేస్తుంటాయి. కర్నూలు జిల్లా రాయలసీమ మాండలికానికి చెందింది కాబట్టి సామాన్యంగా రాయలసీమ పలుకుబడులు వినిపిస్తాయి. కన్నడభాషా ప్రాంతం ఈ జిల్లాకు సమీపవర్తి కావడం చేత కన్నడ భాషా పదాలు, ప్రయోగాలు ఉంటాయి. ఈ జిల్లాకు ఉత్తర దిక్కున మహబూబ్ నగర్ ఉండటం చేత తెలంగాణా ప్రాంతం పలుకుబడులు (ఉదా॥ వచ్చిలేదు (రాలేదు), దూప (దాహం), కొన్ని హిందూస్థానీ పదాలు ఇక్కడి వాడుకలో వినిపిస్తాయి. ఇవి ఈ ప్రాంతం విలక్షణతను తెలియపరుస్తాయి. ఉదాహరణకు వాడుకలోని కొన్ని పదాలు వాటి ప్రాచీన రూపాలు కింద పరిశీలించడమైంది.

| | కావ్యభాషా పదం | కర్నూలువాడుకలోని పదం | కర్నూలుజిల్లాలో అర్థం | కావ్యభాషలో అర్థం |
|---|---|---|---|---|
| 1) | ఇఱుకటము | ఇరకాటం | ఇరుకు చోటు | ఇరుకుచోటు |

"క తఱచగు పెనుసంపదతో, నిఱుకటమునఁ బడ్డ నృపతి"
(శృంగార నైషధము ౯,ఆ)

| | | | | |
|---|---|---|---|---|
| 2) | ఇరుస | ఇర్స | రెండుకుంచాలు, అరతూము | రెండుకుంచాలు అరతూము |

"ఎ, గీ. ప్రస్థ యుగళా ... ము."
(ఆంధ్రభాషార్ణవము (నిఘంటువు) ద్వి. వై)

| | | | | |
|---|---|---|---|---|
| †3) | కువాడము- కువ్వాడము, కువాళము | కువ్వాడం | ఎగతాళి, పరిహాసం | కపటచేష్ట |

ద్వి. లోకంబులో లేని లోటతాఁటకత్తె, నీకువాడమ్ము
లన్నియు మాకుఁ దెలియుఁ, గైకొని సేఁకలఁ
గాచిరా పొమ్ము, నీకంటె మిక్కిలి నెఱజాణ నేను.
(ద్విపద హరిశ్చంద్ర చరిత్రము. ఉ.)

| | | | | |
|---|---|---|---|---|
| 4) | కోక | కోక | స్త్రీలు ధరించే వస్త్ర విశేషము, చీర | వలువ, కట్టుగుడ్డ, వస్త్రము. స్త్రీ పురుషులలో ఎవరికైనా కావచ్చు. |

ఉ. కోకయు నాసనంబు గొడుగున్ శయనాయులుఁ దాసయై జయో
త్సేకము తోడనాకుగల శేఖరుఁడన్ ధ్వజవాహనాదికా,
స్తోకపపుర్విశేషములతో గరుడుండుఁ బరంబు సర్వమున్,
దాకొని కామమున్న కుముద ప్రముఖుల్ సతతంబునఁ గొల్వగన్."
(పరమ యోగి విలాసము ౧. ఆ.)

| | | | | |
|---|---|---|---|---|
| 5) | గలబ | గలాబ | గోల, గొడవ | కలఁత |

ద్వి. క్రతు కర్మములకు విఘ్నములు గావించి, క్షితి
మీఁద గలబలు చేయుఁదెల్లడల"
(భాగవతము ౬, స్కం.)

| | | | | |
|---|---|---|---|---|
| 6) | గడ్డపాఱ | గడ్డపార | నేలను పెల్లగించెడు సాధన విశేషము | నేలను పెల్లగించెడు సాధన విశేషము |

"గీ. వాఁడు శల్యాసురుండన వసుధఁ బరఁగు,
శల్య రూపతనునికిఁ దచ్చులలచయము, గడ్డపాఱల

† గుర్తుగల కావ్య భాషా ప్రయోగాలు శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు (1979 పునర్ముద్రణ) నుంచి, తక్కినవి శబ్దరత్నాకరము (1969 పునర్ముద్రణ) నుంచి సేకరించడం జరిగింది.

| | కావ్యభాషాపదం | కర్నూలు వాడుకలోని పదం | కర్నూలు జిల్లాలో అర్థం | కావ్యభాషలో అర్థ |
|---|---|---|---|---|
| | కైవడిఁ గానుపించి పేర్చుట ఖన్నిక్రశలుఁడను పేరుఁగలడు. ("కళాపూర్ణోదయము ౭, ఆ.) | | | |
| 7) | గాసము | గాసం | జీతం | ఆహారము |
| | "వ పేసరేఁగి ఘేసంబులు గాసంబులు గొని" (భాగవతము ౨, స్కం) | | | |
| 8) | గుంజు | గుంజు | ఈడ్చు | ఈడ్చు |
| | "సీ. కరముష్టిదండ మొకఁడు వేసిపోవైచె సంజకొకఁడు శిఖ గుంజి యడిచె" (హరిశ్చంద్రోపాఖ్యానము ४, ఆ) | | | |
| †9) | తగవు | తగువు | కొట్లాట, జగడం | కొట్లాట, జగడం |
| | "కం. కోపము పాపమునకుఁ బొత్తిసెనుఁ దగవునకుఁ దగఁగ నేతిట్లాటల్, ప్రాపించు నోపడంతుల కో పురుష శ్రేష్ఠ యవియు నొక్కట్ బ్రతుకులే" (కళాపూర్ణోదయము 3 229., ఫేమేశ్వరపురాణము 5.95) | | | |
| 10) | తాప | తాప | మెట్టు | మెట్టు |
| | "వారి దేవతల్ దొలఁకులకేలఁ దాపనిడి తోమఁ గలం కడగెన్" (ఆముక్తమాల్యద ४, ఆ) | | | |
| 11) | పావడ | పావడా/పాగడా | స్త్రీలు మొలకట్టు కొనెడు వస్త్ర విశేషము. | స్త్రీలు మొలకట్టు కొనెడు వస్త్ర విశేషము |
| | "క్రొమ్మెఱుఁగు దువ్వలువల్ కడవేసి జిల్లు పావడలొగిఁ గట్టి" (చంద్రభాను చరిత్రము) | | | |
| 12) | పైట | పైట | ఓణి | స్త్రీల ఱొమ్ము మీది వస్త్రము. |
| | | 'పైఁటకులాగులాడి' | | |
| 13) | పైనీళ్ళు | పైన్నీళ్ళు "నిల్చినచోటఁబేనీళ్ళు చల్లి" | పేడకలిపిననీళ్ళు | పేడకలిపిననీళ్ళు |
| 14) | బిత్తలి | బిత్తలె | దిసమొలవాడు/ దిసమొలది | దిసమొలవాడు/ దిసమొలది |
| | | "అత్తరి బిత్తలై" (హంస వింశతి ౨, ఆ) | | |
| 15) | మాపు | మాపుసారి | రాత్రి | రాత్రి |
| | "ఉ. మాపటివేళ నీవు వనమధ్యము వెల్వడివచ్చి గోష్పద ప్రాపిత ధూళి ధూసరిత భాసిత కుంతలమైనరోరుహూ | | | |

| కావ్యభాషాపదం | కర్నూలువాడుకలోని పదం | కార్నూలు జిల్లాలో అర్థం | కావ్యభాషలో అర్థం |
|---|---|---|---|

దీపితమైన నీ మొగము దీరజనోత్తము మాకు వేడ్కతో
జూపి మనంబులన్ మరుని జూపుదు గాదె క్రమక్రమంబునన్"
(భాగవతము ౧౦, స్కంధ)

| | | | | |
|---|---|---|---|---|
| 16) | మై | మై | దేహం | దేహము |

"వేమరునడు నెత్తి మూర్కొనుచు మైపులకింప"
(ఉత్తర రామాయణము ౪, ఆ)

| | | | | |
|---|---|---|---|---|
| 17) | నెత్తి | నెత్తి | తల | తల |

"ఎ.గీ. కాకి యైన గ్రద్దయిన నులూకమైన, నెత్తి
సోకిన వాడాలు నెలలగెదయు"
(జైమిని భారతము, అశ్వమేధపర్వము ౨, ఆ)

# 4
# కర్నూలు-శ్రీకాకుళం వ్యవహారం కొన్ని విశేషాలు

—ఉషా పన్నాల

వృత్తిపద పరిశోధన ఆధారంగా తెలుగులో ప్రధానంగా నాలుగు భాషా మండలాలు ఉన్నాయని తెలిసింది. అవి (1) పూర్వమండలం కళింగదేశం, శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలు (2) దక్షిణమండలం రాయలసీమ, నెల్లూరు, ప్రకాశం జిల్లాలు. (3) ఉత్తర మండలం ( తెలంగాణా, మహబూబ్‌నగర్, ఖమ్మం, కోస్తా రాయలసీమలను ఆనుకున్న తాలూకాలు ఆయా భాషా మండలాల్లో కలుస్తాయి.) (4) మధ్యమండలం (ఉభయగోదావరులు గుంటూరు, కృష్ణాజిల్లాలు).

కర్నూలు శ్రీకాకుళం జిల్లాలు భౌగోళికంగా ఒకదాన్నుంచి ఒకటి దూరముండడమే కాక రెండూ రెండు భాషా మండలాలకి చెందినవి. శ్రీకాకుళం ఆంధ్రప్రదేశ్‌కు ఉత్తరంగా తూర్పుతీరాన ఉంది. దీనికి ఉత్తర, పడమరలలో ఒరిస్సా జిల్లాలు, తూర్పున బంగాళాఖాతం, దక్షిణాన విశాఖజిల్లాలు సరిహద్దులు.

కర్నూలుజిల్లా ఆంధ్రప్రదేశ్‌లో దక్షిణభాగాన ఉంది. దీనికి ఉత్తరాన మహబూబ్‌నగర్ జిల్లా, దక్షిణాన అనంతపురం, కడపజిల్లాలు, తూర్పున ప్రకాశంజిల్లా, పడమర కర్ణాటక రాష్ట్రం సరిహద్దులుగా ఉన్నాయి.

ఏ జీవద్భాషలోనైనా అనేక కారణాల వల్ల మార్పులు రావడం సహజం. ఈ మార్పులే భాషలోని వైవిధ్యానికి కారణం. భాషలో ఏ అంశాలైనా ఈ మార్పులకు లోనుకావచ్చు. అంటే ధ్వనుల్లో, పదజాలంలో వ్యాకరణ అంశాలలో కలగవచ్చు. ఈ రెండు జిల్లాల తెలుగులోని కొన్ని విశేషాలు స్థూలంగా ఈ కింద చర్చిద్దాం.

(2) పదజాలం:

ఈ రెండు జిల్లాలలో విలక్షణంగా కనిపించే పదాలు, పదబంధాలు చూద్దాం.

| | మాట | అర్థం |
|---|---|---|
| (1) | అవ్వ (క)<br>అమ్మమ్మ (శ్రీ) | తల్లి తల్లి |
| (2) | జేజి, అవ్వ (క)<br>నాయినమ్మ, మామ్మ (శ్రీ) | తండ్రి తల్లి |
| (3) | జేజినాయ్న (క)<br>తాత (శ్రీ) | తండ్రితండ్రి |
| (4) | ఆడబిడ్డ (క)<br>ఆడపొట్టి (శ్రీ) | భర్త అక్క/చెల్లెలు |

## కర్నూలు-శ్రీకాకుళం వ్యవహారం, కొన్ని విశేషాలు

| | మాట | అర్థం |
|---|---|---|
| (5) | పెమ్మ (క) | |
| | పెమ్మ, దొడ్డమ్మ (శ్రీ) | తల్లి అక్క |
| (6) | తో కోడలు, యారాలు (క) | |
| | తోడికోడలు, జాదువ (శ్రీ) | భర్తసోదరునిభార్య |
| (7) | వియ్యంపురాలు, బీగురాలు(క) | |
| | వియ్యంకురాలు, వీరకత్తె (శ్రీ) | కొడుకు/కూతురు |
| (8) | అత్త (క) | అత్తగారు |
| | అత్త, బాప్ప (శ్రీ) | మేనత్త |
| (9) | ఉల్లిగడ్డ (క) | |
| | నీరుల్లి (శ్రీ) | |
| (10) | ఓణి/గేరు (క) | |
| | సందు (శ్రీ) | వీధి |
| (11) | గంటు (క) | |
| | మూట (శ్రీ) | మూట |
| (12) | గాసగాడు (క) | |
| | కూలి(గాడు) (శ్రీ) | కూలివాడు |
| (13) | గొత్తు (క) | |
| | పోల్చుకొను (శ్రీ) | గుర్తుపట్టు అనేఅర్థం |
| (14) | జంపు (క) | |
| | పొడుగు (శ్రీ) | పొడవు |
| (15) | జోగులు (క) | |
| | జోబులు (శ్రీ) | జేబులు |
| (16) | నగు (క) | |
| | నవ్వు (శ్రీ) | నవ్వు |
| (17) | టపాసులు (క) | |
| | పటాకీలు (శ్రీ) | టపాకాయలు |
| (18) | గాజ (క) | |
| | గాదె (శ్రీ) | గాదె |
| (19) | లావు (క) | |
| | వలం (శ్రీ) | సత్తువ |
| (20) | బుడుకు (క) | |
| | వెతుకు (శ్రీ) | వెతుకు |
| (21) | సత్యం చెయ్యి (శ్రీ) | ప్రమాణం చెయ్యడం |
| (22) | సొమ్ములు పూయు (శ్రీ) | బండికి ఎడ్లు కట్టడం |
| (23) | బండిపూయు (శ్రీ) | |
| (24) | ఉర్లగడ్డ (క) | |
| | బంగాళదుంప (శ్రీ) | ఆలుగడ్డ |
| (25) | దవులు (శ్రీ) | రంగు |
| (26) | పకాలి/పకాళి (శ్రీ) | తరువాణిఅన్నం |
| (27) | పల్‌కర్ర/పల్‌దోముపుల్లచేయు (శ్రీ) | దంతధావనం |

| | |
|---|---|
| (28) గండిక చేయు (శ్రీ) | అల్లరి చేయడం ఉత్సవం సంబరం చేయడం |
| (29) కలుపు (క)<br>గాబు (శ్రీ) | కలుపు |
| (30) కుక్క (క)<br>జెపి (శ్రీ) | కుక్క |
| (31) రాగి/రాగులు (క)<br>చోడి (శ్రీ) | రాగులు |
| (32) అల్లకడ (శ్రీ) | |
| (33) వాయ్న (క) | అయన |
| (34) వామె (క) | ఆమె |
| (35) తట్టు(క) | ప్రాంతం |
| (36) పతక (శ్రీ) | ముల్లంగి |
| (37) సొత్తు దుంపలు (శ్రీ) | లాగు |
| (38) ఇగ్గు (క) | యాదపత్రి |
| (39) కోనారి (శ్రీ) | తీగ |
| (40) బడ్డు (శ్రీ) | నీళ్ళు తోడడం |
| (41) తెండు (శ్రీ) | |

కొన్ని పదాలు ప్రయోగాలు కొన్ని ప్రాంతాలకే పరిమితమవుతాయి. వీటికి కారణాలు అనేకమై ఉండవచ్చు. ఇప్పుడు పైనున్న పద పట్టికను చూసినట్లైతే కొన్ని కర్నూల్‌కి విలక్షణంగాను కొన్ని శ్రీకాకుళానికి విలక్షణంగాను కనిపిస్తాయి. కర్నూల్ తీసుకున్నట్లైతే దీని మీద సరిహద్దు భాష అయిన కన్నడ భాష ప్రభావం లేకపోలేదు. అందుకు కారణంగా

| | |
|---|---|
| నగు | 'నవ్వు' |
| బీగుడు | 'వియ్యంకుడు' |
| బీగురాలు | 'వియ్యపురాలు' |
| గొత్తు | 'తెలుసు' |
| బుడుకు | 'వెతకడం' |

వంటి పదాలు అక్కడ వ్యవహారంలో ఉన్నాయి. అదే విధంగా ఒరియా భాష ప్రభావం వల్ల శ్రీకాకుళంలో ఉన్న తెలుగులో కొన్ని ఒరియా పదాలు కనిపస్తున్నాయి.

**ఉదాహరణకు :**

| | |
|---|---|
| జాదువ | 'తోడికోడలు' |
| పకాలి/ళి | 'తరువాణి అన్నం' |
| బాలి | 'ముక్క' |
| దద్ద | 'పిన్ తండ్రి' |
| బెసారో | 'అన్నీ కలిపి వండిన కూర' |

ఒరియాభాషలో 'ఝా' అంటే తోడికోడలు అని అర్థం. అట్లాగే తెలుగులో "తరువాణి అన్నం" అన్న దానికి ఇక్కడి వ్యవహారంలో 'పకాలి' పర్యాయ పదంగా కనిపిస్తుంది. ఒరియాలో 'పఖాల్' అంటే రాత్రి మిగిలిన అన్నం నీళ్ళలో వేసినది-అని అర్థం కనుక ఇది కూడా ఒరియా నుంచి ఎరువు తెచ్చుకున్న పదమని స్పష్టంగా చెప్పవచ్చు. అదేవిధంగా 'బాలి, బెసారో, దద్ద' కూడా ఎరువుపదాలే అయిఉండవచ్చునని అనుకోవచ్చు.

కొన్ని సమయాలలో ఎఖువు తెచ్చుకోవడం వల్ల పదాల్లో సమరూపత ఏర్పడే అవకాశం ఉంటుంది. అటువంటి సమయాలలో ఆ సమరూపతను తప్పించడానికి ఒక దానికి సమానార్థక పదాలు ఉన్నప్పుడు అందులో రూపభేదం గల రూపం వ్యవహారంలో నిలిచి పోతుంది. సమరూపపదం ఆ అర్థంలో పోతుంది. దీనికి ఉదాహరణగా ఈ రెండు ప్రాంతాలలో 'దుంప-గడ్డ' తీసుకోవచ్చు. 'గడ్డ' అన్నమాటకి 'దుంప' పర్యాయ పదం అని అర్థం చెప్పుకోవచ్చు. కానీ శ్రీకాకుళంలో ఆవిధంగా అనుకోటానికి వీలులేదు. ఇక్కడి వ్యవహారంలో 'గడ్డ' అంటే ప్రత్యేక అర్థం ఉంది. అది నీటిపారుదల అన్న అర్థంలో వాడుతారు. నాగావళి నదికి పర్యాయపదం అయిన 'ఒట్టిగడ్డ' లో కూడా ఇది కనిపిస్తుంది. ఇంకో అర్థంలో దుంప వాడుతారు.

సొత్తు దుంపలు
ఎర్రదుంపలు

కొన్ని ప్రాచీన పదాలు నిలిచిపోయి ఉండడం కూడా భాషా విలక్షణతలకు కారణం అవవచ్చు. ఇప్పుడు కుక్కకు పర్యాయపదం 'బెపి/వేపి' శ్రీకాకుళంలో వ్యవహారంలో ఈనాటికి ఉంది. ఈ మాట ఇంకెక్కడా తెలుగు వ్యవహారంలో ఉన్నట్టు తెలియడం లేదు. ఇలాంటివే

| | | |
|---|---|---|
| నూలు | = | నువ్వులు |
| బైసి | = | సిగ్గు |
| మట్టు (క్రి) | = | తొక్కు |
| తెండు (క్రి) | = | తోడు |

అదే విధంగా కర్నూల్లో మిగిలి ఉన్న పదాలు.

| | | | |
|---|---|---|---|
| కువ్వాడం | (<కువడము/కువాళము) | = | ఎగతాళి, పరిహాసం |
| గ్రాసం | (<గ్రాసము) | = | జీతం |
| తాప | (<తాంప) | = | మెట్టు |

ధ్వని విభాగం :

రెండు ప్రాంతాలలోను కింది మార్పులు కనిపిస్తున్నాయి.

1) అ > ఒ

ఈ ధ్వని మార్పు ఒక ఓష్ఠ్యాల తరువాతే గాక ఇతరత్రా కూడా మారుతుంది.

| కర్నూలు | శ్రీకాకుళం |
|---|---|
| కొడుపు | కొడుపు |
| కొలుపు | కొలుపు |
| పొండు | పొండు |
| మొన్న | మొబ్బ |
| జోగాలు | |

ఈ మార్పు కర్నూల్లో కేవలం నిరక్షరాస్యులకే పరిమితమైతే శ్రీకాకుళంలో అక్షరాస్యులలో కూడా కనిపిస్తుంది.

2) ద — జ

పదాదిలో ఈ మార్పు సహజం. కానీ అజ్మధ్యంలో కూడా ఈ ధ్వని పరిణామం రెండు జిల్లాల భాషలో గమనించవచ్చు.

| కర్నూలు | శ్రీకాకుళం |
|---|---|
| జల్లి < దొల్లి | జడుపు < దడుపు |
| గాజ < గాదె | పింజె < పిండె |
| | పూజు < పూదు |

3) క — వ

ఈ ధ్వని మార్పు కర్నూల్లో పదమధ్యంలోనే ఉన్నట్టు తెలుస్తోంది.

వియ్యంపుడు
వియ్యంకుడు

కానీ శ్రీకాకుళంలో ఈ మార్పు పదాదిన కూడా కనిపిస్తుంది.

పుడతలు } చిన్న పంటకాలువలు
కుడతలు }

4) కర్నూల్లో మాత్రం బ > గ మారడం కూడా ఉంది.

జోగులు < జేబులు

శ్రీకాకుళంలో బ > వ గా మారే సందర్భాలు కూడా ఉన్నాయి.

సబవు < సబబు
కవుర < కబురు

5) వ — బ

కర్నూలు

బెయ్యి < వెయ్యి (వేయు)

శ్రీకాకుళంలో ఈ మార్పు పదమధ్యంగా కూడా సాధ్యం. ఇక్కడపటుకు ఈ విషయంలో ఒరియా భాష ప్రభావమే అయి ఉండవచ్చు.

బేపి < వేపి
బ్రైవోరు < డ్రైవోరు

వ్యాకరణ విభాగంలో కొన్ని విశేషాలు :

6) బహువచనంలో 'ండి, ండు' అంతమయ్యే శబ్దాలలో బహువచన ప్రత్యయం ముందు అనునాసిక 'న' వర్ణం కర్నూల్లో లోపించదు.

| కర్నూలు | శ్రీకాకుళం |
|---|---|
| బండ్లు < బండి + లు | > బళ్ళు |
| పండ్లు < పండు + లు | > పళ్లు |

7) గోరు, నోరు, ఊరు శబ్దాలలో చివరచ్చు ముందున్న రేఫ బహువచనంలో కర్నూల్లో మార్పు చెందదు. కానీ శ్రీకాకుళంలో మార్పు చెందిన రూపాలు కూడా ఉన్నాయి. ఇక్కడ విద్యావంతులలో ఈ మార్పు నిత్యం.

| కర్నూలు | శ్రీకాకుళం |
|---|---|
| గోర్లు | గోర్లు/గోళ్లు |

| | |
|---|---|
| నోర్లు | నోర్లు/నోళ్లు |
| ఊర్లు | ఊర్లు/ఊళ్లు |

8) ఈ కింది నామాలలో బహువచన ప్రత్యయం ముందు కర్నూలు తెలుగులో 'ండు' చేరుతుంది.

| కర్నూలు | శ్రీకాకుళం |
|---|---|
| వాకిండ్లు | వాకిళ్లు |
| కొడవండ్లు | కొడవళ్లు |
| ఇండ్లు | ఇళ్లు |
| ముండ్లు | ముళ్లు |
| కండ్లు | కళ్లు |

బహువచన రూపాల విషయంలో శ్రీకాకుళం వ్యవహారం శిష్ట వ్యవహారానికి సమంగా ఉంది అని చెప్పవచ్చు. అట్లాగే కర్నూలు జిల్లా వ్యవహారం తెలంగాణా వ్యవహారానికి దగ్గరగా ఉన్నట్టు తెలుస్తోంది.

9) తెలుగులో సహచారి సంబంధకారకార్థంలో 'తో, తోటి' ప్రయుక్తమవడం మామూలు. కాని కర్నూల్లో 'తోన, తోని, తోటిగ' లు కూడా వినిపిస్తాయి.

కర్నూలు
నాతోటి
బాణాల్తోటి
బెల్లం తోన
పూల తోని
మేళాల తోటిగ

శ్రీకాకుళంలో కేవలం 'తో, తోటి' ఉన్నాయి.

10) ఉపర్యర్థకాలుగా 'మీద, పైన' వేగాక 'మింద, మీన' లు కూడా వ్యవహారంలో ఉన్నాయి. ఈ అర్థంలో 'మింద' వాడడం రాయలసీమ భాషాలక్షణాలలో ఒకటి అని అనుకోవచ్చు. కడపలో కూడా ఈ రూపం కనిపిస్తుంది.

11) ఇక్కడ 'కూడా' అనే అర్థంలో 'గుడ్క' అనుబంధ పదం వాడుకలో ఉంది.

నాకు గుడ్క 'నాకు కూడా'

12) సంఖ్యా వాచకాలలో కిందితేడాలు కనిపిస్తున్నాయి.

తెలుగులో 'ఐదు' అనే సంఖ్యకు ఏ, ఏను సపదాంశాలు. ఏ, ఏను సమాస పదాల్లో వస్తాయి. కానీ శ్రీకాకుళంలో లాగా కర్నూల్లో 'ఏను' లేనట్టు తెలుస్తోంది. 'పదిహేను' బదులు ఇక్కడ పదహైదు, పదైదు అన్న రూపాలే ఉన్నాయి.

కర్నూలు భాషలో రెండువందలు, మూడువందలు, నాలుగువందలతో పాటు కింది రూపాలు కూడా ఉన్నాయి.

| | |
|---|---|
| రెండునూర్లు, | ఇన్నూరు |
| మూణ్ణూర్లు, | మున్నూరు |
| నాల్గునూర్లు, | నన్నూరు |

13) భూతకాలంలో ఒక మహతీ వాచక ప్రత్యయం ముందు తప్ప ఇతర పురుష ప్రత్యయాల ముందు 'ఏ'తో పాటు 'ఇనా' కూడా ఉంటుంది. ఇది కడప, చిత్తూరుల్లో కూడా ఉంది. కనుక రాయలసీమ భాషా లక్షణం అయి ఉండవచ్చు. శ్రీకాకుళంలో నిరక్షరాస్యులలో మహతీవాచక ప్రత్యయం ముందు కూడా ఈ ప్రత్యయం కనిపిస్తుంది.

అడిగినాము
చేసినాను
ఇచ్చినాడు
తిరిగినాయి

14) భూతకాల వ్యతిరేక క్రియల్లో రెండు జిల్లాలలో తేడా కనిపిస్తుంది. కర్నూల్లో ఈ అర్థం క్వార్థకరూపం పైన లేదు చేరడం ద్వారా వస్తుంది.

చేసిలేదు
పిల్చిలేదు

శ్రీకాకుళంలో ఈ విషయంలో శిష్టవ్యవహారంలో ఉన్నట్టే ఉంటుంది.

చేయలేదు
పిలవలేదు

ఈ పై రూపాలతోపాటు శ్రీకాకుళంలో కింది ప్రయోగాలు కూడా ఉన్నాయి.

చెప్తే విన్నాది కాదు

15) ఈ రెండు జిల్లాల తెలుగులో ప్రాచీనమైన భూతకాల ప్రత్యయం 'తి, టి' కనిపిస్తున్నది.

పెట్టింటిని (శ్రీ)
చేస్తి (శ్రీ) (క)

16) సర్వనామాల్లో కూడా రెండు జిల్లాలలో కొన్ని ప్రత్యేక రూపాలు ఉన్నట్టు తెలుస్తోంది.

వామె (క) | ఆమె
అవిడ (శ్రీ) |

వాయ్న (క) | ఆయన
అతగాడు(శ్రీ) |

రెండు జిల్లాలలో నిరక్షరాస్యులలో కింది ఉత్తమ పురుష రూపాలున్నాయి.

నాను 'నేను'
మాము 'మేము'

మొత్తం మీద ఈ రెండు జిల్లాల భాష గురించి చెప్పాలంటే శ్రీకాకుళం తెలుగు శిష్టవ్యవహారానికి చాలా దగ్గరగా ఉందని చెప్పవచ్చు, అదే విధంగా కర్నూలు జిల్లా తెలుగు కొన్ని ప్రత్యేక లక్షణాలు కనిపించినప్పటికీ తెలంగాణాకి దగ్గరగా ఉన్నట్టు భావించవచ్చు.

# 5

# వ్యవహార ఖండికలు

## వ్యవహర్త – 1

కేంద్రం : ఆత్మకూరు

వృత్తి : లెక్చరర్

కులం : బ్రాహ్మణ, వయస్సు : 36సం॥

చదువు : ఎం. ఏ.

వ్యావహార ఖండిక : దిన కార్యక్రమాలు, వ్యవసాయం

...పొద్దునే ఐదు గంట్లకు లేస్తానండి నేను. ఐదుకు లేసిం తర్వాత, వ్యవసాయముంది. కాబట్టి గాసగాళ్ళను, వాళ్ళను లేపాల, వాళ్ళను లెపిం తర్వాత, ఇక్కడ పశువులవి ఉండాయి, మాకు ఆ పశువులంతా నీళ్ళు దాపించటం వాటికి దాణా పెట్టించడం, పొద్దునే వాటి పాలు పిండిచ్చుకోవడం...అప్పటికిగాని ఇంటికాడ స్నానాలకు దిగలేను. తర్వాత మొహం కడుక్కోని, పాలురోజు, పాలు దాగ్తా నేను. కాఫీ మానేసినా రెండు, మూడేళ్ళ నించి. పాల్తాగేసి ఒక అరగంటసేపు కళ్ళానికి పొయొస్తానేను, కళ్ళంలో కూచ్చోని అక్కడ ఏమన్నా పనులయి, ఉంటే చెప్పి గాసగాళ్ళకు, వాళ్ళను ఆ పన్లలోకి పంపించి తర్వాత ఏడు గంట్లకు వచ్చి, స్నానం చేసి ఏదన్నా పూజా అది, ఇది ఏదన్నా చేస్కోవాల్నుంటే చేస్కోని ఖచ్చితంగా ఎనిమిది గంట్లకు నేను తయార్కావాల రోజు, అంటే రోజు నేను ఆత్మకూరికి వచ్చి వెళ్తాను. అందుకని ఎనిమిది గంట్లకు భోజనానికి కూర్చుంటాను, నేను. ఎనిమిది ఇరవైకి భోజనం ఐపోవాలె ఐపోయిన వెంటనే తాంబూలం వేస్కోఅలి ఎనిమిదిన్నరకు బస్టేండుకొస్నే, అట్లా తొమ్మిదికి లోపల ఎప్పుడో బస్సు వస్తుంది. ఆ బస్సు బట్కోని ఇక్కడికి రావటం. మళ్ళీ ఇక్కడికి వచ్చిం తర్వాత, పన్నెండు ఇరవైకి అట్లాఐపోతే, పన్నెండున్నరకు హోటలుకు ఎళ్తాను. హోటలుకు పోవటమో లేకుంటే పిల్లల్తో తెప్పించుకోడమో, ఏదోకటి టిఫిన్ చేయడము. ఇక్కడ భోంచేసేదేముండదు మధ్యాహ్నమిక్కడ. మళ్ళీ ఇంగ సాయం కాలం నాలుగున్నర గంట్లకి ఈడ కాలేజి ఐపోతూనే మళ్ళీ బస్టాండుకి

పొయ్యి, ఇంటికి పోడం పోయింతర్వాత అక్కడ మళ్ళీ పొలాన్నించి వచ్చింటారు, మా గాసగాళ్ళు వాళ్ళతో ఏం జేస్నారు ఏం కత, అయన్నీ మాట్లాడు కోడం, ఏదన్నా డబ్బులు అయి ఇయాల్సంటే కూలోళ్ళకు డబ్బులిచ్చి వాళ్ళయన్నీ లెక్కరాసి పెట్టుకోడము, తర్వాత మా తమ్ముడుండాడు, వాడు పొలానికి పొయ్యొంటాడు, వాడు ఒచ్చిం తర్వాత ఏం జరిగింది, ఎట్లా అని అంతా విచార్న చేస్కోడం, తర్వాత ఒక అరగంటసేపు అట్లా కొద్దిగా రెస్టు తీస్కోని ప్రాంతీయ వార్తలు విన్న తర్వాత మళ్ళీ కొద్దిగా పశువులు అవి కళ్ళం మీదకి పొయి చూస్కొచ్చోడం ఐపొయింతర్వాత మళ్ళీ సాయంకాలం ఎనిమిదినించి ఫోంచేసిం తర్వాత ఒక గంటసేపు కాలేజి వద్కకు సంబందించి ఏమన్నా ప్రిపరేషను అది ఉంటే చూస్కోడం, ఒక గంట అట్లా చూస్కోని తర్వాత తొమ్మిదిగంట్లకి పిల్లలు ఏం చదువుతున్నారు ఏం కతా ఒక అర్దగంటసేపు కబుర్లు చెప్కోడం మాట్లాడుకోడం ఇవి నా రోజు కార్యక్రమం చేసేది. ...ఇద్దరున్నారండి. మొదట మామూల్గ, రోజుకూలికొచ్చే వాళ్ళు మామూల్గ ఒకరిద్దరన్నా ఉంటారు. మున్నూట అర వైదినాలుండేటటువంటి గాసగాళ్ళు ఇద్దరు. కానిరోజు ఒకరో ఇద్దరో పైన వస్తూనే ఉంటారు. ఇవిగాక మళ్ళీ సేద్యం పనులు ఎక్కవగా బడి కలుపులు, నాట్లు అవున్నప్పుడు ముప్పై, నలభై మంది కూడా ఒక్కోరోజు మాకు పనికి వస్తూంటారు.

...పెద్దగాసగాడు, చిన్నగాసగాడు ఇద్దరుంటారండి మాకు. పెద్దగాసగాడికైతే మూడువేలా ఐదునూర్లు, చిన్నగాసగానికైతే రెండువేలా ఆర్నూర్లు ఇస్తాం. అంటే బట్టలు ఇంకా అన్నం, గిన్నం ఏం పెట్టేది లే. బీడీలకు, గీడీలకు ఏమి ఇచ్చేది లేదు మనము. ఊర్కె డబ్బులు మాత్రం ఒట్టిగాసం అంటాము. ఆ ఒట్టిగాసం ఇచ్చేస్తాం. అంతే. రెండ్నెల్ల కొకసారి, అట్లా తీస్క పోతుంటారు. రెండునూర్లు, మూణ్ణూర్లు అట్ల. ముందు మాత్రం డబ్బు లిచ్చేది లేదు. అట్ల చేస్సుంటం. వాడు, ఆప్సెంటైతే, కుంటేస్కుంటాం. ఆకుంటుకు డబ్బులు పట్కుంటాం. మేం. ...రోజుకు సమత్సరానికి ఇంత కాబట్టి, రోజుకు ఎంతైంది అని లెక్కేస్కోని, ఆ కుంటుకు దినాలు ఎన్నున్నాయో చూస్కోని, ఆ డబ్బులు మాత్రం తీసేస్తాం. టోటల్లో, తీసేస్తె మిగిలింది మాత్రమే వాడికిచ్చేది. అదిగుడ సమత్సరం మాకు ఉగాది నుంచి ఉగాదికి లెక్క. ఇక్కడ ఈ ఆత్మకూరు దగ్గరైతే...శ్రీ...తిర్నాల అని ఉన్నది. ఇక్కడ మాకు...తిర్నాల అప్పట్నించి అప్పటివరకు లెక్క. మా ఊరికి మాత్రం అట్లకాదు. ఉగాదినుంచి ఉగాది పొయ్యేవరకు లెక్క. అధికమాసాలొచ్చినా, తక్కువ మాసాలొచ్చినాగుడ ఉగాదినుంచి ఉగాది వరకే మాకు లెక్కచెయ్యాల తర్వాత మాకు ఈ ఆత్మకూరు తాలూకాలకు ఉన్న భేదం ఉంది. మాకు వ్యవసాయపరంగా ఏంటంటే పుట్లు అని ఇక్కడ అంటారు. మా ఊర్లో పుట్టి అంటే నలభై మూటలు. ఇక్కడ పుట్టి అంటే పదహైదు మూటలు. ఇంకొంచెం అట్లా నంద్యాలవైపుకు పోయినట్లైతే...ఆ పల్లెలుండాయి. అట్ల అక్కడ పదిమూటలే అంటారు. పుట్టి అని మాకుమాత్రం నలభై మూటలు పుట్టి. ఇది పెద్దపుట్టి...పెద్దగాసగాడు మాత్రం ఓవరాల్ సూపర్‌విజన్ వాన్దే ఉంటుం దండి. మనము ఉన్నా లేకపోయినా అన్నిట్ని తూకంగా చూస్కోని, లేవదీస్కొచ్చేటు వంటి వాణ్ణే మేము పెట్కుంటాం. కూలోళ్ళను పిల్చుకోడం, ఏచేను అదునుంది, ఏంసేద్యం చెయ్యాల ఇవన్నీ వాడే చేస్తుంటాడు. మేముగుడ వారానికోసారి లేకుంటే మాతమ్ముడు

న్నాడు గదా, వాడు రెండ్రోజుల కోసారి, రోజు ఒకసారి వొచ్చ్యేస్తుంటాడు. మాకు ఎప్పుడు నచ్చక పోయినట్టైతే ఇది ఇట్లకాదు, ఇట్ల చెయ్యాల అని చెప్తాం మేము. నచ్చిందంటే వాడికి నచ్చినట్టుగనే చేస్తూఉంటే మేం చూస్తూ ఊరుకుంటాం. ఇంక కొయ్యం, కొరముట్టు, అన్నీ మనం చెప్పినట్టు చెయించాల్సిందే...మాకు వచ్చేసి మా ఊళ్ళో ఒక నలభై ఎకరాలుందండి. ఇంక పల్లెల్లో అంతా ఒక యాభై ఎకరాలుంది. మాది కంబైండ్ ఫ్యామిలి. మేము డివైడ్ కాలేదు. మేము త్రీ బ్రదర్స్మి. ఒక తొంబై ఎకరాలుంటుంది. నలుగురు ఆడ పిల్లలు. అందరికీ పెళ్ళిళ్ళు ఐపోయినాయి. మా అక్కా చెల్లెళ్ళ కందర్కీ... రెండవవాడు బి. కాం. ఐపోయింది. వాడు వ్యవసాయమే చూస్కుంటున్నాడు. మూడో వాడొచ్చేసి డి. హెచ్. యమ్. యస్. ఐపోయింది. హైద్రాబాదులో ఉన్నాడు. ఇపుడు యమ్. బి. యస్. చేస్తున్నాడు, కండెన్స్డు కోర్సు. వ్యవసాయమంతా ఎక్వ మాతమ్ముడే చూస్తుంటాడు, రెండోవాడే. ఆయిలింజనుంది. ఏటికి నీళ్ళులేవు. లిఫ్ట్ ఇరిగేషన్ పెట్కు న్నాము. దాంట్లో బుడ్డలు, జొన్న, దనైలుఅవెన్నీ పెట్కుంటాము. ఈరోజుగూడ సెనగ వేసేదానికి ✓ ౖ✓ ‾ యినారు వేసుంటారు. ఈరోజు...మేము ముందైతే ఒరి ఏసినా మండి. దాన్ని ఆ ఒరి ఇరువాలు దున్నినాము. ఇరువాలు దున్నిం తర్వాత గుండు దొర్లించినాము. గుండుగొట్టి బాగ దాన్తర్వాత మళ్ళీ బుడ్డల గొంటికేసి పాస్తాము. ఇరువాలు పాసిపెట్నేం, పాసిపెట్టింతర్వాత పదహైదు రోజులు బాగ ఆరనిచ్చినాం. ఎట్లంటే కొయ్య, గియ్య అంతా బాగ ఎండిపోతుందని తర్వాత నీళ్ళు గట్నేం. నీళ్ళ గట్టిం తర్వాత ఒకవారం రోజులయింది. మొన్న సోమారం గట్టింటిమి. నిన్న మళ్ళీ ఇరువాలు గొర్రు తిప్పి, తర్వాత పరం గొట్టిం తర్వాత ఇత్తనమేసినారు నిన్న. మూడుచెక్కల గొర్రనేది వేస్తాము. బాగ లోతున పడేదానికి. మూడు చెక్కల గొర్రుతోఇత్తన మేసి ముందు గొర్రుపోతుంటె వెనకం బడే ఒకమన్నిని పెట్టేసి పద్నాల్గు ముప్పైఐదు పద్నాల్గు కాంప్లెక్సు ఎరువు ఆచాళ్ళల్లో బడే ట్లు చల్లుకుంటూ, అంటే నాకు వేరే ఈనాడు గొర్రు అని ఒకటుంది. కాని అది ఆ కొయ్యిలల్లో సరిగా పన్చేయట్లే. అందుకని మన్నిని పెట్టించి ఊర్కే ఆ ఎరువు చాళ్ళల్లో పడేటట్లు చల్లించి వెనకంబడి గుంటక బాయించినాం. అట్ల జేసినాం.

మామూల్గ ఐతే ఈ సెనగ ఉగాది లోపల వచ్చేస్తుందండి. చలిమంచుంటే బాగొస్తుంది. లేకుంటే కొంచెం తక్కువై అంటే ఇపుడు దానికి ఇరిగేషను ఫెసిలిటీ ఉంది గాబట్టి ఒక ట్వెంటీ ఫైవ్ డేస్కొకక తడి, మళ్ళీ ఒక ఫిఫ్టీ, ఫిఫ్టీ ఫైవ్డేస్ కొక తడి టూ టైమ్సు నీళ్ళు గట్టాల అని అనుకున్నాం. అందుకనే వేసిందిగూడ, లేటైనా గూడ మామూల్గ ఐతే మాకు ఒరి అవి కోసిం తర్వాత చెరువుంది మూడ్చెరువులున్నాయి. చెరువుల్లో ఇప్పుడు డిసెంబరు ఆఖరుకు గాని పూర్తిగాపు. ఆ పనులన్నీ మాకు, వడ్లు కోసేది అది అంతా గడ్డు తోల్కుండేది, దున్నుకునేదంతా డిసెంబరు ఆఖరులోనే వేస్తాము. వేస్తే అదేం పెద్దగా రాదు. పెద్దగా వస్తే రెండు బస్తాలు వస్తాయ్. అంతే అంతకంటె ఎక్కువ ఏం సెనగరాదు. ఐనా ఏమంటే కర్చులేకుండా పండుతుంది. మీదటికెప్పుడైనా ఏగిత్నేసి పెట్టుందాల కాబట్టి... ఆదుక్కి ఇప్పుడే ఐతుంది. ఒకసాలు దున్నతాము. అడ్డంగా, మళ్ళీ సాలంబడే దున్నుకుంటూ లట్ట గట్టి ఎస్కుంటూ పోతాం ఇత్తనం. ఇప్పుడు అట్ల చెయ్లేమనేను. కోయించి నీళ్ళు గట్టి అంతా బాగాచేసి, ఎట్లాంటే...రెడ్డి ఇప్పుడు పాణెం నియోగకపర్గానికి కన్నెట్టు

చేస్తున్నాడు తెలుగు దేశం తరఫున, ఆయన మంచి ఫలితం సాధించినాడు సెనగలో హెక్టారుకు పదహారు బస్తాలు పండించినాడు...ఇదె మొదటిసారి నేను ఇర్రిగేషన్ కింద వేయడం. మామూల్గ ఐతే ఎకరాకు రెండు బస్తాలు, మూడు బస్తాలు అంతే ఒరి మళ్ళళ్ళో వచ్చేది. ఈ సారి మాత్రం ఇరిగేషన్ ఫైసిలిటీ కింద వేస్తున్నాను గాబట్టి ఒక పది బస్తాలన్నా హెక్టారుకు రావాలె అనుకుంటున్నా నేను. మరి ఎంతొస్తుందో చూడాలె.

...సేద్యంలో అంటే వర్షాలు బాగా పడి ఇరిగేషన్ ఫైసిల్టీ బాగుంటే నష్టమేం లేదండి. ఒక ఉద్యోగి సమత్సరములో సంపాయిచ్చేదాన్ని మీరు ఒక కార్లో పండిచ్చుకోవచ్చు. నాకు ఆ నమ్మకముండే నేను అధైర్యంతోనే నాకు ప్రమోషన్ గూడ వస్తే నేను పోలేదు. నాకు లెక్చరర్‌గా ప్రమోషన్ ఒక రెండు సమత్సరాల క్రిందట ఇచ్చేరు. పొలముంది ఊర్కే పాడైపోతుంది, ఇది ఆబ్సెంట్ ల్యాండ్ లార్డ్ కిందైతే కష్టము. ఏం ఒస్తే సమత్సరానికి ఒక రెండువేలు, మూడువేలు అక్కడ అదనంగా రావచ్చు. ఇక్కడ కష్ట పడ్తే ఆ రెండు మూడు వేల్ను తీస్కోవచ్చనే ఉద్దేశంతోని పోలేదు. రేట్స్ బాగున్నాయి కాని ఈ డ్రైన్‌ఫైడ్ ఏరియా, లిఫ్టిరిగేషన్ కింద మొన్ననే ఒక రెండు సమత్సరాలైంది. ఆ లైండును తీస్కోని అంతకుముందంతా ఊర్కే ఉన్నింది. లిఫ్టిరిగేషన్ కింద బానే ఉంది. హోప్ఫుల్‌గనే ఉంది. పెద్ద బయ పడాల్సినటువంటి అవసరము ఏం లేదు. ఇరిగేషన్ ఫైసిల్టీ బాగుంటే మా ఏరియా సాయిల్స్ మంచివి. మంచి పంటలొస్తాయ్ ..వొడ్లు నాకొక ఏడెకరాలు సొంతం మాగాణి ఉందండి మా ఊర్లో. తర్వాత మాకు రెండు గాండ్లు సేద్య ముంది. చాలదు పొలం అందుకని వేరే పొలం కోరుకు వేస్తున్నానేను. ఆ కోరుకువేసేది ఒక పదహేడు ఇరవై బస్తాలొస్తాయి. తరాత గుత్తకు గూడ తీసుకున్నాను. ఒక ఐదెకరాలు మా వాళ్ళదే బంధువుల్ది. అంతా ఒక రెండు వందల బస్తాలు. రెండువందల మూటలు వొడ్లు ఐతాయి. మాకు ఇంటి కర్చులకు ఒక నలబై బస్తాలైతే సరిపోతాయండి సమత్సరానికి. కాబట్టండి మేము ఒక్కటేసారిగా అమ్మము మనకు అవసరమున్నప్పుడు, అమ్ముకుంటూ ఏస్తాం అంతే. ఒక్కసారిగా లోడు అంటూ ఇవ్వాలనే నియమమేం లేదు. మా ఇంటి పద్ధతి మొదట్నించి గుడ అంతే. ఇంకోటి ఏమంటే మాదెంతా అమెరికా సిస్టం. మనంఅనుకున్న ధరవస్తేనే అమ్మడం. లేకుంటే దాన్లను తీస్కబొయ్యి దిబ్బలో బొయ్యడం. అంతేకాని అమ్మేదేమి లేదు. అమ్మాలని నియమమేం లేదు. మనం అనుకున్న రేటు రావాలి. వొచ్చినప్పుడే లేకుంటే పశువులకు పొయ్యడమో, ఏదో ఒకటి చేస్కోడం, అంతేగాని వాడు అడిగిందరకు ఇవ్వాలనేటటువంటి దేమి లేదు. అదిముఖ్యమైందంటే ఒక ఎక్స్‌పోర్టు పెంట్ల క్రితమైతే ఢిల్లీ భోగాలని ఏస్తుంటిమండి. ఆడిర్లి భోగాలు ఎక్కువరోజులుంటాది. అది డిసెంబరు ఆఖరుకుగాని కోతకురాదు. మాకేమి చెర్వుల్లో నీళ్ళు సరిగ ఉండవు. కొంచెం ఒక తడిగిడి తక్కువైనాగుడ పంట సరిగారాదు. ఎంత గొప్పగా పండ్తేదండిగ పండ్తే గుడ ఇరవైమూటలకంటే ఎక్కువ పండడంలె. ధరగుడ తక్కువై పోయింది వాటికి మసూరి వచ్చింతరాత దాన్ల ధర తక్కువైంది. అందుకనే మానేసినాం. మానేసి, ఒక ఐదారేండ్లు ఐదునెల్ల వొడ్లు అని వాట్ని ఏసేవాళ్ళం. ఇప్పుడు అదిగుడ పొయ్యింది. ఒక ఐదారేండ్ల నుండి ఇప్పుడు మసూరి వేస్తున్నాం. మంచి పంటొస్తుంది. నాకు ఈ సమత్సరము ఒక రెండు తళ్ళే నీళ్ళు తగిలిందేది. ఒక ఇరవై సెంట్ల వొరి మడుంది. పద్నాల్గ

మూటలైనాయి. నిరుడు నలభై ఆరు మూటలైనాయి రెండెకరాలు. మేం పెద్దగా లావులు గుడ ఏం పెట్టము. రెండు సమత్సరాల కొకసారి చేదెరువు తోల్తాం. అంటే ఇక్కడ పొణకలి అంటాం మేము పొణకలి పెద్ద పెద్ద పదహైదు బస్తాలు పడ్తుంది ఒక్కొక్క పొణక అట్లాంటి పొణకలో నాలుగు పొణకలు కొల్తగాదు, తోలకం పొణకలు అంటే లోపలికే ఉంటుంది. పూర్తిగా నిండుగారాదు అవి ఒక నాలుగు పొణకలు తోల్తాం ఎకరాకు. అట్లా రెండు సమత్సరాలకొకసారి ఈ ఏడు తోల్తే మీదటికి తోలం మళ్ళపైన వచ్చే ఏడే తోలేది. ఇకముందు మందేం వెయ్యము. ఎట్లంటే మాకు వానర్ది నమ్మకం లేదు. మళ్ళీ చెడగొట్టి ఏమన్నా వేస్కోవాల గాబట్టి, ముందు మందేస్తే నష్టపోతామని, తర్వాత ఇత్తనం వేసేస్తాం. ఊర్కే అట్లే ఇత్తనం వేసి తర్వాత నెలరో, ఇరవై రోజులకో వానపడ్డ తర్వాత సేద్యేలని జేసిం తర్వాత ఎప్పుడుపడి వానపడి వొరి మళ్ళో నీళ్ళు ఆగితే ఆరోజు వెంటనే దాన్ని విడకేసి నాటేస్తాం. అంటే ఆసాళ్ళల్లోనే ఎక్కడనా పోయినచోట్ల, దండిగా ఉండేది విడిపించడము లేనిచోట్ల నాటడము. నాటిం తర్వాత అప్పుడు కెమికల్ ఫెర్టిలైజర్స్ వాడ్తాము. ఈ ఎక్కువ కాంప్లెక్స్ ఎరువులే వాడ్తాను.

...మాకు నిన్నటి కరువులో ఒక నాలుగు ఎకరాలు మాత్రం నీళ్ళు పారింవండి. మాకు చెరువుకు దగ్గరగా ఉండి పొలము ఒక రెండు తప్పు నీళ్ళు వొచ్చినాయి. అవి మాత్రం ఒక అరవై శాతం పంట వొచ్చినాయి ఇంక కింది తట్టు చెరువుకు దూరంగా కింది వైపుకు ఒక మూడెకరాలుండె. అది పాసేసినాం. దాండు కోసేసి, పాసేసి, జొ వేసినాం జొన్న మొదట వేస్తే ఏసేరోజే వానవొచ్చి సచ్చిపోయింది. నీరు కుట్టు బ బతకత్లే. మళ్ళీ తర్వాత సేద్యంజేసి మళ్ళీ జొన్న ఏస్నాం. అది ఏమంత బాగ మొల్చ . దానివల్ల నష్టమే. ఐతే గుత్తకు దీస్కున్నానని చెప్పినా ఒక ఐదెకరాలు, అదిమాత్రం పొలం చాలా మంచిది దానికి నీళ్ళు రాలేదు, ఏం లేదు, కేవలం వర్షాధారంతోనే పండించడి... అది వరి నాల్నెల్ల వరి ఏసినాడు. ఒక సగం పంట పండింది అది మీదటికూడా అట్లె కంటిన్యూ చే ్లను. మన్నిచ్చిగుడ పెట్నేదాన్ని...పొలాన్ని బట్టండి. మా పల్లెల్లో నాకే పొలముంది మోతుకూరు పేరవల అని మూణ్ణాళ్ళు, మైళ్ళలో విలేజస్ఉంటాయ్. చెరువుల కింద మాకే ఉంది అక్కడ మాత్రము ఎకరాకు తొమ్మిది మూటలు ఇస్తున్నా నేను. దెబ్బై అయిదు కేజీల బస్తాలో ఎకరాకు తొమ్మిది మూట వారి, నేను ఇచ్చినాను. మంచి పొలాలు చెరువుకు దగ్గర ఉన్నది ఒక్క లడి నీళ్ళు వచ్చినాగుడ పండుతాయ్. మా ఊళ్ళోగుడ చెరువుకు దగ్గర ఉండే పొలాలు ఎనిమిది మూటలు, తొమ్మిది మూటలు ఉంటాయి. అవెంతా రైతులు కుంజనిబట్టి ఉంటాదండి. రైతు ఆసక్తికరంగా పండుకు పొయ్యేటటువంటి గ్రామం తత్వమైన గ్రామమైతేనా, మంచి గుత్తలు సాగుతాయి. లేకుంటే పోవు. నాకు హుసేనాపురంలో పొలముంది అది గుత్తకిచ్చినాను. అసది ఉండేది అరవై సెంట్లే. అరవైసెంట్లు పద్మూడు మూటలు గుత్త. వడ్లగుత్త. ఆ గుత్త ఇక్కడ ఈ నుంచే రెండెకరాలకు, గుడ ఇయ్యరు. అక్కడ ఉన్న ఆశక్తి అట్లాంటిది ఎలిపొలం గుడ అక్కడ మూడెకరాలుంది. పదహైదు నూర్లు అగాగుత్త. అంటే ముందె మనకు కట్టాల డబ్బులు. మళ్ళా ఆ సమత్సరం చేస్కోవాలె. అదే నాకిక్కడ రామాపురమని ఇక్కడ ఒక ఊరుంది పాలముక్కలా అని. ఆత్మకూరికి దగ్గరే, అక్కడ ఆరెకరాలుంది. రెండు నూర్లు గుత్త·

సమచ్చరమంతా జేస్కున్నాక, ఇచ్చేది వాడు గుత్త. ఆరెకరాలకు రెండు నూర్లే... రెండు నూర్లే కాని వాడంటే, రైతుయొక్క ఇష్టరెస్టునుబట్టి ఉంది. రైతు కుంజినిబట్టి చేల గుత్త లుంటాయి. పొలాలేమో అవి ఇవి ఒకటే పొలాలే. మంచి పొలాలే కాని రైతు కుంజిని బట్టి సాగుచుంటుంది మా ఊర్లో మూడు మూటలు గుదరాని... కిందికి నీళ్ళ నమ్మకంగా పారనివి మూడు మూటలు అట్లా ఇస్తారంతే. ఇప్పుడు మేము తీస్కున్నది పొలము మంచిదే కాని ఏమది ఎవురెవురో వేస్కుంటుయాండినారు. దానికి సరిగా సత్వలులేవు. పొలమంతా గడ్డిబడి అంతా పైన ఇదిగా...దాగలేదు. కాని పన్నెండు మూటలుదు తీస్కున్నానేను ఐదెకరాలు. కాని చేస్తే దాంట్లో నష్టం రాదనుపిచ్చింది నాకు, ఇక్కడ. దాగ మంచి పొలమే ఐతే దానికొక ఇదేందంటే భవిష్యత్తులో మనమే కొనొచ్చు, దాన్ని అని. మా ఒంభవుల్దే. ఎవుర్కో ఉండే దాని కంటే మన చేతికిందనే ఉంటే మనమేదాన్ని అమ్మే ఒప్పుడు కొనొచ్చు...తీస్కున్నా.

...ఒకావుందండి అది బైటికిపోదు. అది ఇంట్లో కట్టేసి మేపాల్సిందే. దానికి ఒక దూడ ఉంది. అదిగుడ మేమేం కొన్నది గాదు. ఎప్పుడో ఇరవై రెండేళ్ళనాడు మాతండ్రి గారు ఒకావును కొనిన్నారు. అట్లా ... గా వస్తున్నదని మేముకొన్లే. అదిగుడ అమ్మేస్తాం అనుకున్నాను. అంత కష్టంగుంది. ఊరికే కట్టేసి మేపాలంటే ఊర్లో...మాకు మందలుంటాయి. బర్గొడ్ల మందలున్నాయి దాంట్లో పోదది. మాకు బర్గొడ్లున్నాయి. నాలుగు బర్గొడ్లున్నాయి. మూడు బర్గొడ్లిస్తున్నాయి. ఎద్దులున్నాయి. నాగ్లెద్దులున్నాయి. ఎద్దులు మాత్రం కళ్ళంలో కట్టేస్తాం. బర్గొడ్లను ఆవుల్ను మట్కు, ఇంట్లోనే పశువుల ఇల్లు సపరేటుగుండి, పసలింట్లో కట్టేస్తాం.

...గిరిసెల్లో పోస్తాం...పైనే. మాకు వానలు ఎక్కువ అందుకని, భూమిలో గరిసెలు నిలవవు. పైన పోస్తేనే గోడలకున్న నెమ్ము ఎక్కి, సమ్మచానికి బస్తా, అరబస్తా పాడైపోతుంటాయి అడుగులంతా. ఆ గరిసెల కింద అంతా గడ్డి, గడ్డిమీద తడికవేసి, తడిక మీద సంచి బట్టలు ఏసి, పాత్సంచి బట్టల్న్ని వేసి, మళ్ళీ గడ్డి వేసి, చుట్టూ గడ్డి బెట్టి, అ... పోస్తాం మేము. అట్ల నిలవ చేసినాగుడ మనము అన్నీ ఐపోయిన తరాత చూస్తే, ఒక అ బస్తానో, బస్తానో కింద నెమ్ము అయి, మక్కి పోయుంటాయి. కాబట్టి మాకు అన్నీ గన్నలే. గాజెలు, దండిగా ఉంటాయి కాబట్టి గాజెలు వాదము. ఏవో కొర్రలు, జొన్నలు అట్లావి, కొద్ది కొద్దిగా వచ్చేవాటికి గాజెలు వాడుకుంటాము. మిగతదంతా గన్నలే. ఇంక బుడ్లల్ గిడ్లల్ దండిగా వచ్చినాయంటే తడికెలు కట్టేస్తాం. మాకు స్థంభాలెక్కువ. మా ఇండ్లల్లో, స్థంభాలకు అడ్డంగా ఇట్లా, ఇట్లా అడ్డంగా నిలువుగా తడికెలు కట్టేసి దాంట్లో పోసేస్తాం...ధరొచ్చినప్పుడు అమ్ముకునేది.

...ఉల్లిగడ్డ ఎప్పుడు వెయ్యలేదండి మా ఊర్లో ఉల్లిగడ్డగుడ ఎక్కువ వెయ్యరు... ఇక్కడ పండ్తుందేమో కాని మాకు నీటి ఆధారం తక్వ...అంతా కింద రాయిచట్టు. నీళ్ళు బడవు. ఏ పద్మూడు గజాలు, పద్నాల్గు గజాలు గొట్టి ఒక పదహైదు గజాలు వ్యాసమున్న బాయిగుడ నాలుగు ఎకరాలుగుడ పారిచ్చలేరు. కాబట్టి ఉల్లిగడ్డలు మా ఊర్లో ఎయ్యరు. ఇప్పుడిప్పుడు బుడ్డలు దనియాలు, తర్వాత ఒకరిద్దరు రైతులు మల్బరీ బెట్నేరు. పట్టుపురుగు కొరకు. తరాత ఏదన్నా కూరగాయల పైర్లలో, మిరప, వంకాయ అట్లాంటివేస్కుంటారు.

బాయిలుగూడ మా ఊర్లో ఏం పెద్దగ లేవు అంతా పది పన్నెండు బాయిలున్నాయి. అంతే అది గూడ ఈ ఐదారేండ్ల నుంచి వచ్చినవే గాని, ఈ సబ్సిడి కింద కొంతమంది కొట్టిచ్చినారు. అంతకు ముందు ఒక ఇద్దరు కొట్టిచ్చినారు. ఇప్పుడు మా ఊర్లో ప్రత్యేకంగా కన్పిస్తున్నది ఏంటంటే ఈ ఐదారేండ్ల నుంచి వర్షాలు తక్కువైతున్నందువల్ల, మిగతా పొలం కంటే ఈ వాగు గడ్డల ఎంబడి ఉన్న పొలాన్ని ఎక్వ, వ్యవసాయం చేయడం మొదలు పెట్నేరు. ఇంజను, ఆయిల్ ఇంజను తీసుకరావడం ఆ నీళ్ళను లిఫ్ట్ చేస్కోని వేస్కోడము. అట్లా ఈ నాలైదేండ్లల్లోనే, ఒక పది పన్నెండు మంది ఇంజన్లు పెట్నేరు, వాకు... వాగుంది. అది మార్చి వరకు పారుతది. మార్చి తర్వాత తగ్గుతది. బాగ పెద్దగా ఉండదు. . కాని ఆవాగే ఒక్కసారి గన పొర్లిందంటే, గాదెరనుంచి మా చెరువులన్ని నింపుతది. ఐతే ఆ చెరువులు పైకున్నయ్, వాగు కిందకె పోతుంది. దానికేమో, రిజర్వాయరు కట్టాలని, ప్రపోసల్స్ ఉన్నాయ్ ఏమో కాలేదు ఇంకా.

...మాకు ఒక కారు పండాల అంటే రెండుసార్లు చెరువు నిండాలె...రెండుసార్లు నిండాలె. అంటే సెప్టెంబరు ఆ ప్రాంతంలో ఒకసారి నిండి మళ్ళీ అక్టోబరులో ఒకసారి నిండితేనే పూర్తి పంటలు [illegible] క్కు కారు పూర్తి పంట అంటే చెరువుల ఆయకట్టు విస్తీర్ణం కంటే, ఎక్కువ విస్తీర్ణంలో సాగు చేస్తున్నాం పొలాన్ని. ఆయకట్టు కంటే ఎక్కువ విస్తీర్ణంలో ఇప్పుడు అక్కడ మల్లమ్మ చెరువని, రామ సముద్రం చెరువని, ఈదుల్ చెరువని మూడు చెరువులున్నాయ్. రామ సముద్రం చెరువు అన్నిటికంటె పెద్దది. దానికింద మామూల్గ ఐదారు నూర్లు ఉండాల్సిన ఆయకట్టు, పదహారు నూర్లకుంది. పదహారు నూర్ల పొలానికి పారిచ్చాలంటే రెండుసార్లు నిండితేనే, అందులో ఒక్కసారే గన నిండుతే వాళ్ళు పెట్టిన అయకట్టు దగ్గిర్కె నమ్మకంగా పండుతది. ...మిగతాదంతా పోతుంది. వొదిలేస్కోవాల్సిందే అది. రెండుసార్లు పడేప్పటికి మాకు ఎట్లుందే ఇక్కడ ఈ డిసెంబరు, నవంబరు మధ్యలో వానలు పడ్తాయ్. వరికోసేటప్పుడు గుడ వానలు పడ్తాయ్. ఆ వానలు గన పడి మళ్ళీ చెరువు నిండుతే, అప్పుడు ఎండాకారు వేస్తాం. ఎండాకారు అంతా పండదు. కొంత పొలం రెండు మూడు వందల ఎకరాలు పండుతుంది. అది ఆచెరువు కింద మాత్రమే. మిగతా చెరువుల కిందైతే...పండవు. అవి చిన్న చెరువులు సరిగ పండవు.

...అంటే చిన్నప్పుడు ఎప్పుడు పొలమంటే బాగ ఇష్టమైంది. లేకుంటే నా వృత్తి ఇది ఐనా గుడా, ప్రవృత్తే అట్లుండది. చిన్నప్పట్నుంచి, పొలాలకు పోడము, చాల కాల తీస్కోడము అంటే ఎక్కువ ఇష్టము అది. ఒకసారి నేను మానాయ్న ఇద్దరం బొయ్యొస్తున్నాం. మా నాయ్న పిల్చుకపోతుండె. ఐతె...రెడ్డని ఒకాయ్న, వాళ్ళిద్దరు క్లాస్ మేట్సంట, అడిగినాడు మా నాయన్ను. ఏమయ్యా చిన్నప్పట్నుంచె చేలకు తిప్పుతున్నావే అని. అందే పెద్దన్నా, ఎంట బడ్తుంటే ఏం చెయ్యాల అని అన్నాడు. తరాత సేన్లగిరికి పోయింతరాత అడిగినా, అన్నా ఇది మన చేను అని నువ్వు ఎట్ల కనుక్కుంటావు. ఇన్ని చేలున్నాయే, కరెక్టుగా మన చేను దగ్గిర్కే పోస్నావే నువ్వు ఎట్ల వచ్చినావు అని. అందే అయ్న నవ్వి అంతే అలవాటైతే అట్లే పోస్తావు, నువ్వుగుడ రేపు అలవాటు మీద వస్తుంది అదంతా, నువ్వు అది వాళ్ళ చేనని, ఇది వీళ్ళ చేనని చెప్తుంటావే మాకు తెలియదే అని చిన్నప్పుడు అడిగినట్లు బాగ జ్ఞాపకము. అయ్న ఆ మాట అంటుండె.

...మామూళ్ల ఔతే, మా ఊళ్ళ దగ్గర, నీళ్ళకు రాత్రిళ్ళే పోతారు. రైతులు సొంతంగా నీళ్ళు పెట్కోవాల అనుకున్నవాడు, రాత్రిపూట పోతేనే నీళ్ళు పార్తాయ్. పగులు పూటైతే పారవు. మామూళ్ల కొట్లాటలు మాత్రం, దండిగనే జరుగుతాయ్. అర్సులెక్కు, కొట్కోడం తక్కువ. ఇది అంతా ప్రసూతి వైరాగ్యం మాదిరి. అప్పటికప్పుడు అర్చుకునేది, తిట్టుకునేది, తర్వాత అందరూ మామూలే దానివల్ల కక్షలు పెంచుకొని, అట్లాంటివి, ఏమి ఇప్పుడు జరగట్లే. నీళ్ళ దగ్గర కొట్లాట మామూళ్ల, మడవల్ దగ్గర ప్రతి సమత్సరము ప్రతి వానికి జరుగుతుంది. కరుకు కాబట్టి ఎట్లంటే మాకు వేరే ఆధారంలేపు ఆ నీళ్ళతోనే పండిచ్చుకోవాల గాబట్టి ఐతే అప్పటికే తాత్కాలికమే. ఆ ఇంత ఐపోయ్నదంటే, మర్స ప్రొద్దు మళ్ళి ఏంరా, అంటే ఏంరా అని, ... పోవడముంటుందే కాని, వాణ్ణి చూస్తే వీనికి సరిపోదం, వీణ్ణి చూస్తే వానికి పడపోడం వాడి పొలం వీడు కోస్కొచ్చేడము, వాడి పొలంలో ఉన్న నీళ్ళు వీడు ఎల్లబెట్టడం, బొర్రలు బెట్టి, అటువంటి చెమి మా ఊర్ల తట్టు జరగదు. లేదంటే ఒకటి చెరువుకాలవ అని పైనుంచి వొస్సుంది. చెరువాగు కొండలో నుంచి వొస్సుంది. నల్లమలకొండలోనుంచి, అవాగుకు ఇపుడు అక్కడంతా పేదం పొలాలు ఉండినయ్. అవన్నికొన్నారు రైతులు, రెడ్లు కొన్నారు. ఆ చెరువుకంతా నీళ్ళు రాకుండా కట్టలు అడ్డంకట్టేసి, వాళ్ళ పొలాలకు పారిచ్చుకుంటున్నారు. ఒక ఐదారేండ్లనుండి. కలెక్టరు...అని ఉండె, అయన ఒక ముప్పైవేలు కర్చుపెట్టి, అ కాలవ నంతా డీపెన్ చేసినాడు. ఒకవన్ అండ్ అఫ్ మైల్. ఇప్పుడు వాళ్లు అంతచెడ్డొంర్రె. మళ్ళీ ఈసారి చేసినారు అని అన్నారు. ఇప్పటికీ జరగలె....

చిన్నప్పటికి, ఇప్పటికీ కూలీలల్లోచాలా మార్పు ఉందండి. వ్యవసాయపు పనులు చేసేటటువంటి కూలీ జనాల్లో చాలా మార్పు ఉంది. ఒకప్పుడు పొద్దున ఎనిమిదికంతా, వాళ్ళు వాళ్ళ ఇండ్ల దగ్గర అన్నందిని వచ్చేవాళ్ళు పన్లోకి. ఇప్పుడు రైతు స్వయంగా ఇండ్ల దగ్గిరికి వెళ్ళి పదిసార్లు పిలిస్తేగుడ...రాలేదె అని...ఒకరిమీద ఒకరు చెప్కోడమే తప్ప వాళ్ళంటూ బయల్దేరేదేమి లేదు. తొమ్మిది తొమ్మిదిన్నరకు గాని బయల్దేరడము లేదు. ఐనాగుడా, సాయంకాలం పొద్దు గూకే వరకు చేసేవాళ్ళు ఇంతకు ముందు. ఇప్పుడు మొల్లోడు అజా యిచ్చినాడంటే చాలు, నాలుగు, నాలుగుంపావు కంతా పొద్దు దిక్కు చూడడము, ఎల్లి రావడము. ఇంతకు ముందు ఈరోజు చేస్తే రేపొచ్చి గింజలు ఏపిచ్చుక పోవాలె. ఇప్పుడట్లగాదు. దుడ్లు చేతిలో ఎయ్యాలె ముందు. అ దుడ్లు చేతులో బడ్తేనే వాళ్ళు కదిలేది. లేకుంటే కూలిజనం పలకడం లేదు. మాకు ఈ పేపరుమిల్లు ఒకటొచ్చేసింది. దాంలో కొంచెం లేబరుకు డిమాండయి పోయింది. ఐతే వాళ్ళ మనమాట ఎప్పుడు ఇంటారంటే కరుకు మీద ఉన్నప్పుడు మనమాట ఇన్రు. పని లేనప్పుడు మాత్రము కూలికొస్తుమా అదెయ్యా అని అడుగుతూంటారు అంతే. ఇంక పంటల విషయంలో గుడ పురుగు లెక్కువైపొయ్నాయ్. ప్రతిదానికి పురుగే వొచ్చేసింది. కుసుమకు నాకు ముప్పై ఆరేండ్లంటే పదహారు, పదిహేడేండ్లనుంచి మంచిగ జ్ఞాపకంలో ఉన్నవే ప్రతివిషయము. ఎప్పుడు, నాకు కుసుమకు పురుగొచ్చింది నాకు జ్ఞాపకంలేదు. ఈసారి కుసుమకు గుడ పురుగొచ్చింది. విపరీతమైనటువంటి పురుగొచ్చింది. కంట్రోలు చెయ్డం కష్టమైపోయింది. కుసుమలు మేము అమ్మేస్తామండి. పోస్తే ఎద్దులకు పోస్తాము. రుబ్బి, దాణాగా...బాగ తింటాయ్ లైకుంటే అమ్మేస్తాం. కుస్మనూనె వాడము. కుసుమలు అంతా మంచి ధర

ఉంటాయి. ఐతేదాన్ని ఎయ్యడం వల్ల ఏమంటే కంప ఖర్చులేదు. కావిలి కర్చు లేదు. పశులు మేయవు. ఉత్తకంప. ముండ్లు, ఉత్తముండ్లు, ఒక్క పదిహేనోజులు పాలు పోసే టప్పుడు చిలకలు కొట్టాయ్. ఆ పదిహేనోజులు పగులు కావిలేసుకుంటే ఏం బాదలేదు. ఇత్తనం గుడ్క చాలా తక్కువ ఖరీదు. న్యాలాపాయల్ పడి. మనము ఐదు నాలుగు పళ్ళు ఎకరాకు … కాల్ల జొన్న వేసినట్టే వేసేది. అదిగుడ ..ఇపుడు కాలేజొచ్చిం తర్వాత వెలుగోడు బాగా, ఢిల్లిలో సెంటు ఏధర ఉంటదో వెల్గోట్లో సెంటు ఆధర ఉండద అని మొదట్నించి మానాయ్న చెప్తుండె ఢిల్లి ధరలు వెల్గోట్లా అని. పది ఏండ్ల కిందట్నే సెంటు పన్నెండు నూర్లు, మా ఊర్లో. ధర స్థలం జాగా ఇండ్ల స్థలానికి ఇప్పుడు కుడ అదే ధర. అట్లైమెయింటైన్ అయ్ ఇంగా ఎక్వనే అయిండేకాని పడైపోయ్నార్లు అట్ల, తగ్గనెమో తగ్గదు. అదే నందికొట్కూరు, ఆత్మకూరులో సెంటు మూడువేలు. నాల్వేలు. వెలుగోట్లో మాత్రం తక్వ లేదు. చుట్టుపట్ల ఐదారు ఊర్లకది మంచి జంక్షన్. ఎక్కువ వ్యాపారము అది బాగ జరుగు తుంటాది. ఇండ్లకు ఒకప్పుడు దిక్కైండ్లే, ఎవ్వరుండేవాళ్ళు కాదు. ఎంతసేపున్నా అక్కడ ఫారెస్టు డిపార్టుమెంటు, ఎక్వ ఉద్యోగస్తులు. ఇప్పుడు హాస్టల్ డిపార్టుమెంటు, ఎడ్యుకేషన్ డిపార్ట్మెంటు ఇది మూడే. ఇప్పుడు పేపరుమిల్లు ఒకటొచ్చేసింది. కాలేజొకటొచ్చేసింది. తర్వాత ఈ మాకు మద్రాస్ వాటర్స్కీమని ఒకటి పెట్టేరు. ఇక్కణ్ణించి, క్రిష్ణా వాటర్సు, మద్రాసుకు తీస్కపోవాల దయా వెలుగోడని ఒక డివిజన్లో ఏమో, వెలుగోడు తెస్తున్నార్ట. కాబట్టి. ఇప్పుడు ఇండ్లబాడిగలు బాగా పెరిగినాయి. నూటయాభై, రెండు వందలదాకా ఉంది ఆ పల్లెల్లో ఇంటి బాడిగ. ప్రతివాళ్ళు ఎద్దుల మిద్దెల్నంతా, పశుల్ను కళ్ళాల్లో కట్టేస్కోడము, అరలు గట్టిచ్చి, ఈ స్టూడెంట్సుకు, యాభైరూపాల్ అరవై రూపాల్ ఏంపైసిల్లి ఉండదు. వాడు బయట స్నానం చెయ్యాల, లోపల పుస్తకాలు పెట్కోని చదువ్కోవాల. అంతే. అరవై రూపాల్ అట్ల ఇస్తున్నారు ..పెట్టిదండి. వెలగోడు ఇపుడు జనాభా ఓటర్లిస్తే, పన్నెండువేలు, ఇరవై వేలు జనాభా...

అంటే బాగా జ్ఞాపకమున్నది. మా అన్నగారి మరణం ..నేను తొమ్మిదో తరగతి చదువ్తున్నాను అప్పుడు, ఆయ్న కప్పటికే ఇరవై రెండేండ్లు. బి. యస్సి. పైనలియర్ ఐపొయ్యి, పరీక్షలు వ్రాసి. శెలవుల్లో ఇంటికి వచ్చినాడు ఉగాది పండక్కు. టైఫాయిడ్ జెరమొచ్చి, ఉగాది ఐన ఆరోరోజు చచ్చిపొయ్యాడు. అంతకుముందు నేను, ఇంట్లో ఏదైనా పప్పులుగానీ, బెల్లం గానీ, చక్కెరగానీ అట్లఏవన్నా డబ్బాల్లో పెట్టె ఎత్కపొయ్యే గుణముండేది నాకు చిన్నప్పుడు. ఒకరోజు జెరంతో ఉన్నాడాయ్న, మావూల్ల రెండు గంట్లకు ఇంట్రవెల్ టైంలో, బయల్దేరి, ఇంటి కొచ్చినా, మా అమ్మోళ్ళు నిద్రపోతున్నారు బయట తెరవాల ఉంది. లోపల పడుకున్నాడు ఈన. నేను లోపల కొట్టింట్లోకి పొయ్యా, కొట్టింట్లోకి పొయ్యి. నాకొక అలవాటేమిటంటే చక్కెర, బియ్యము, నెయ్యి మూడు కల్పుకోని తినేఅలవాటు, అది పెద్దవాళ్ళకు తెలియ కుండా దొంగతనంగనే, అట్ల చేస్తున్నా అన్నమాట. చక్కెర కొరకు డబ్బాలు సప్పుడు చేస్తుంటి, అప్పుడన్నాడు, నాకు బాగా జ్ఞాపకం ఒక్క పెంటిక అట్లచేస్తావు, ఇట్లాచేయ్గుడ్దు మంచిగుండాల నాయ్నా. అది మాత్రం బాగా జ్ఞాపకం, తర్వాత మధ్యాహ్నం చనిపో య్యాడు. ఆయ్న చనిపోతాడని గూడా, మేం ఎవ్వరము అనుకోలేదు. నేను బడికి పొయ్యొచ్చి నాను.. ఒంటిగంటకు బడికి పొయ్యొస్తె అప్పటికే పూర్తి ఐపొయ్యింది పరిస్థితి. మా తాత

ఇక్కడే పుట్టింది ఉంది. మా చిన్నతాత ఉన్నాడు. మా అమ్మకు చిన్నాయ్న. ఆయ్న రాత్రే అప్పటికి ఇంగా. వస్తాడేమో అని చూస్తుంద్రి. ఆయ్న మూడుగంటలకు వచ్చి నాడు. ఆయ్న వచ్చినాడు తరాత చచ్చిపోయ్నాడు. అప్పటికి మాచిన్నతమ్ముడికినాల్గేండ్లు. వాణ్ణి తీస్కోని, నేను మాపక్కనె ఒక ఇల్లుంటే, ఆ ఇంటివగ్గర కూచోబెట్కోని వానికి అంతా చెప్తాంటూ ఏడుస్తున్నా. ఆ సంఘటన మాత్రం నాకు బాగా జ్ఞాపకముంది. నేను మర్చిపోలేను. నా జీవితాంతం.. కనుక్కోలేకనే. అప్పటికి ఇంకా మెడికల్ ఫెసిలిటీస్ లేవు. డాక్టర్స్, పెద్దగా లేరు. ఆయ్న నేను వగ్గెత్తుకుంటూ మా ఇంటి పక్కలెల్లి, డాక్టర్.. అని ఉన్నాడు. ఓ మామా మా అన్న చచ్చిపొయ్నాడంట చూస్పురా చాలా ఏడ్చినాను చాలా వాళ్ళ ఇంటిముందు పొర్లాడ్నాను, రమ్మని పిల్చినాను. ఆయ్న రాలేదు. ఇప్పటికీ నాకు బాగా జ్ఞాపకమున్నటువంటి సంఘటన ఇదొక్కటే.

తర్వాత నేను యస్సెల్సీ చదివేటప్పుడు అంతవరకూ బాగనే ఉన్నాను. నేను తొమ్మిదో తరగతిలో మా అన్న చనిపోయింతర్వాత, మా నాయ్న మున్మల్నేమనేవాడు కాదు. ఎందుకూ అని ఆయ్నలో ఒకవిధమైనటువంటి వైరాగ్యమొచ్చేసింది అందుకని కొంతస్వేచ్ఛ రావడంతో ఇంటిపట్టున ఉండకుండా తిరగడ నాకు. అంబాడైపోయ్యి, టెస్ట్ అట్లే ఐపోయింది. యస్సెల్సీలో ఫెయిలయ్నానేను. యస్సెల్సీలో ఫెయిల్ గావడానికి కారణం గూడా ఒకటుంది. నేను కాంపోజిట్ మేథ్స్. మాకు కొట్టంట్లో ఒక పెద్ద పెట్టె ఉంది. ఆ పెట్టెలో నేను పుస్తకాలన్ని పెట్కొంటుండె. ఆత్మకూరుకొచ్చి మాకు సెంటరు వెలుగోట్లో పరీక్షరాయనీకిలే ఆత్మకూరుకొచ్చి రాయాల. ఒక రెండ్రోజులు ముందేవచ్చి, ఇక్కడ రూమ్లు వెతుక్కోని, ఏదినుంచి రూమో మాట్లాడ్కోని అక్కడ ఉండి ఆవారంరోజులు ఉండి పరీక్షల్రాసి మళ్ళీ ఊరికి పోవాల. ఆరోజు మద్దెనం భోంచేసి ఇంగ ఆత్మకూరికి రావాలని పెట్టె మీద సర్దుకుంటున్నాము. అన్నీ ఐపొయ్యి డ్రైవర్ వచ్చిం తర్వాత బస్టాండు కొచ్చిం తర్వాత జ్ఞాపకమొచ్చింది. స్కేలు మర్చిపోయ్నానని, ఆస్కేలుకొరకు ఇంటికొచ్చినా. ఇంటికొచ్చి ఆ పెట్టె మూత లెర్చి అట్ల పైకి ఎత్తిపెట్టి లోపల్కివంగి స్కేలు తీస్కొం టున్నా. తీస్కొంటుంటె ఆ పెట్టె మూత పెద్దది. చాలా పెద్దది. పెట్టెసైజు చాలా పెద్దది. చెక్క పెట్టె. ఆ మూతపడి, బొటనేలు అంతా చితికిపోయింది. చితికి అంతా రక్తము బాగా కారింది. అప్పుడు మా తల్లి దండ్రులు గుడ, అమ్మ నాయ్న వద్దన్నారు. ఎందుకు పోతావు పరీక్షకంటే లేదని బలవంతంగా వచ్చేస్నా, నేను ఇంగ నన్ను ఆడ్డగించేంత ధైర్యం ఆమెకు లేక పోయిన్నింది. అప్పుడు వచ్చింతర్వాత గ్రాఫు అవి వెయ్యాలి, సరిగ చెయ్లేక, కాంపోజిట్ మేత్స్లోనే తప్పు వచ్చినాయి నాకు. ఫెయిలయ్నాను ఆసంవత్సరము. అంతవరకు నేను ట్యూషనుకు పోలె. ఎక్కడా, ఎపుడుగుడ దాని తర్వాత ..అని ఒక టీచరుండె ఆయనదగ్గిరకు ట్యూషనుకు పంపించె మా నాయ్న. పడిస్తే రాత్రి అక్కడే పడుకునేది ఇంటి కొచ్చేదిలే. రాత్రిప్పు గుడా ఇంక చేల మీద పడేది బుడ్డల్ చేలల్లో పడేది. బుడ్డలెత్కొచ్చు కునేది, తినేది ఇట్ల చేస్తుండేవాళ్ళము. అవి బాగ గుర్తుందాయి. నాకు యస్సెల్సీవరకు స్నేహితు లెవ్వరు లేరండి. ఇప్పుడు...రెడ్డి ఉన్నాడు. ఇక్కడ కాన్స్టిట్యూయెన్సీలో కంటెస్ట్ చేస్తున్నాడు. కాంగ్రెస్ ఐ టికెట్ తరఫున ఆయ్న తమ్ముడు...రెడ్డని, వాడు నేను బొంగరాలు విపరీతంగా ఆడేవాళ్ళం, బాగ అప్పుడు. తర్వాత యస్సెల్సీ ఫెయిలైంతర్వాత

ట్యూషనుకు వెళ్ళింతర్వాత స్నేహితులెక్కువైపోయ్యారు. ఎప్పుడైతే స్వేచ్ఛవచ్చిందో అప్పుడు స్నేహితులతో పరిచయాలెక్కువై పోయ్యాయి. అప్పటి స్నేహితులే ఇప్పటికీ... కానీ అప్పుడు అవెరేజ్ స్టూడెంట్ని. ఇప్పుడూ మావాళ్ళు అంటుంటారు, నువ్వొక్కడివే జీవితంలో బాగ వచ్చినవాడివి. మేమనుకోలేరా, నువ్వు రెక్వరక్ ఐపోతావట్లా అని. కళ్యాలికి నేను వెళ్ళిం తర్వాత నా జీవితం ఒకరకంగా మారింది. మాతాతగారున్నారక్కడ మంచి పేరు ప్రఖ్యాతులున్న మన్ని...గారని గొప్ప సంగీత విద్వాంసుడు, మ్యూజిక్ డైరెక్టరగా కూడ సినీఫీల్డ్‌లో వర్క్ చేసినారు, కొన్ని చిత్రాల్లోనూడ. ఆయనకు ఒక్కతే కూతురు మా అమ్మ. ఆయనదగ్గర ఉండి చదువుకోడంతో అప్పట్నించి మా జీవితంలో పెద్ద మార్పు రావడం జరిగింది. అది.

## వ్యవహర్త-2

కేంద్రం : ఆలూరు    కులం : బోయ

వయస్సు : 17సం॥    చదువు : ఇంటర్ (ప్రథమ సం॥)

వ్యవహార ఖండిక : కుటుంబవిషయాలు, ఆటలు    వృత్తి : విద్యార్థి

మా ఫ్యాదర్ మామూల్ వ్యవసాయం చేస్తాడు. వ్యవసాయమంటే మాకేం బూమేమ్ లేదు. కూలికి చేస్కుంటాము. మదర్ వచ్చేసి అంగడి పెట్టుకొంది. మామూలు మిర్చి, కాపీ...అంగడి పెట్టుకునింది తర్వాత వచ్చేసి మా యిన్నగుడ ఇంటర్ చదివినాడు. సెకండ్ ఇయర్ అయిపోయింది. మొన్న మెడ్రాస్‌కు పొయ్యాడు. ఇది టెలివిజన్ అండ్ రేడియో ఇన్స్టిట్యూట్ నేర్చుకొవానికి పొయ్యాడు టూ ఇయర్స్ అంట అది ఇపుడు వన్ఇయర్ అయిపోయింది. ఇంక వన్నియర్ అక్కడే చేస్తాడంట. తర్వాత వచ్చేసి మా చెల్లెలుగుడ ఇప్పుడు ఐదోతరగతి వరకు చదివింది. ఇంగ తర్వాత నేనుగుడ మామూలు ఇంగ ఇక్కడే ఇదే కాలేజిలోనే ఆరోతరగతి నుంచి పదోతరగతి వరకు సదువ్కుంటూ వచ్చి నాను. ఇప్పుడు ఇదే కాలేజిలోనే ఇంటర్‌గుడ చదువ్తుండాను ఇపుడు మాయింటి పరిస్తితు లంటే ఒకరకంగా మేమంతా కూలి చేస్కోనే బతుకుతున్నట్లు. ఇంక మా ఓల్లు ఉన్నారు ఈడే...మా ఓల్లు అంటే ఇపుడు వాల్కి ఎనుము గొడ్లు ఉన్నాయ్. ఆ ఎనుము గొడ్లతోనే వాల్లు బతుకుతరు. అయింతర్వాత ఇపుడు మా చిన్నాయ్న ఉన్నాడు. ఈ పంచాయత్ సమితి మెంబరు తర్వాతేమో ఇంకో మాచిన్నాయ్న డ్రైవరు ఇంకొక అంటే మా నాయ్నకంటే పెద్ద, పెద్దయ్య, ఆ పెద్దయ్యొచ్చేసి గ్రెంగు పన్చేస్తడు. రోడ్లు దానికి ఈ పంచాయత్ రాజ్‌లో దాంట్లో మా మామ వొచ్చేసి అంటే మా అమ్మతమ్ముడు, పెద్ద అతను వచ్చేసి టీచరుపని చేస్తడు. పెద్దహొత్తూరులో ఉండాడు ఇపుడు. ఇంకొక అతను వచ్చేసి సినిమాహాల్లో బుకింగ్‌లో ఉండాడు. మా అమ్మ తండ్రికి అంటే ఇద్దరు భార్యలు, అంటే మా అమ్మ తల్లి మొదటి భార్య ...తర్వాత మా తాతకి రెండో పెండ్లాము చేస్కున్నాడన్న మాట. ఇపుడు మా అమ్మతల్లి కొచ్చేసి ముగ్గురే. మా అమ్మ ఇద్దరు తమ్ముల్లు. మా తాత రెండోపెండ్లాము కొచ్చేసి ఐదుమంది. ముగ్గురు కొడుకులు, ఇద్దబిడ్లు...ఇక్కడే ఉండారు. ...ఆపని ఈపని చేస్కుంటనే ఉంటరు. ఇంట్లో పనులంటే నేనేమి చెయ్యడంలేదు. మామూల్ ఎపుడో ఒకసారి అంగడిమీద కూచ్చుంటే కూసుంటాను లేదంటే లేదు. లేదంటే ఒకోసారి మాఅవ్వ హోటల్‌కి పాలిచ్చిరమ్మంటే కేరియర్ తీస్కోనొచ్చి పాలిచ్చి పోతుంటాను.

ఇప్పుడికి అయిదేండ్లయింది...మానాయ్న అంటే తాగ్తాడు బాగనే ఇంతకుముందు బాగుండె అలవాటు. ఒకోసారి బాగ తాగి ఎక్కువ్ తక్కువ్ తాగి వస్తాడు ఇంటికి. అదే వినంగ ఒకరోజు అది ఏదో పండగ కరిరోజు, ఆరోజు ఏమైందంటే బాగ తాగినాడుదండిగా తానొచ్చి ఇంట్లో పండుకున్నాడు. బూ తినమంటే, తర్వాత అయింతర్వాత తింటాన్లే నేను బువ్వ, ఇపుడు ఆకలికాదు నాకు అంటే, సర్లె అనేసి మేమందరు తినేసి పండుకుంటిమి.

తర్వాత మా అమ్మ వచ్చి, మా నాయన్ని లేపితే బూ లింపవు లెయ్యకుంటే, లెయ్యలేదు, మా నాయ్న అసలు. మా అమ్మ ఉండి ఏమో మీనాయ్న లెయ్యిదం లేదు, లేపు, మీనాయ్నేమో లెయ్యకుండ పొండుకున్నాడు అట్లే అంటే, ఏమని నేను పొయ్యి లెయ్యకుంటే లెయ్యలేదన్నట్లు. తర్వాత లేప్తిని. లేప్తే లేసి నీల్లు దాగె. నీల్లు దాగి నాకాకలి కాదిపుడు ఆకలైనపుడు లింటానులే అని మల్లీ పండుకున్నాడు. మొదటిసిన్నా ఇడ్సినే తర్వాత చూస్నే ఏమి మాట్లాత కుండగ అట్లే పండుకున్నాడు ..పండుకుంటే గుర్క ఆగిపోతే, ఏమయ్యా గుర్క పోతుంటే అని మాఅమ్మ, మాఅవ్వను పిల్చుకోనొచ్చి చూస్నే, ఏం, మస్నంతా సల్లగుండాదు. ఆస్పత్రికి తీస్కపోదాము అని ఆస్పత్రికి తీస్కోనాస్నే ఆముండి చైనాసేదయింది చచ్చిపోయి, అన్చెప్తే, సర్లే అని మరి ఇంటికి తీస్కొనొస్తిమి ఆడుంటే మా చిన్నాయ్నండి అహొద్దు మంచిదికాదు. ఆపీసోల్లు అది, ఇది అంటారు ఆడుంటే బాగుండదని ఇంటికి తీస్కొనొస్నిమి. ఇంటికి తీస్కొనొచ్చిం తర్వాత ఇంక అందరూ ఉన్న బందువుల్నందర్నీ పిల్పిచ్చి ఇంగ మా నాయన్ని పూడ్చిపాస్నిమి...ఏమైంది చెప్దు అంటే అది ఎక్కువ తాగ్తే అవిదంగా అదిగల్లు అడ్డం పడి ఊపిరాడ కుండగ సచ్చిపొయ్యాడని అంటరు మా ఇంటికాడ పెద్దలు...మా అమ్మ అపే ఇంక మా అప్పుండి ఇంతదబ్బిచ్చిందె. కొంత ఆ దబ్బుతోనే, అంగడి ఆ పుగ్గేలు, మిర్చి కాఫ్లీ ఇవన్నీ పెట్టుకోని అట్లే గడుపుకుంటుం దాము. అప్పుడప్పుడు మా అవ్వోల్లు, పాలడబ్బుల్లోన మాకు ఇంత ఇచ్చుకుంటూ, వాల్లు ఇంక మా చిన్నాయ్నవోల్లంటే ఇంగెవ్వరు మమ్మల్ని చూసేతాల్లే లేరు. ఇంక వాల్లి వాల్లే మాది మాదే అన్నట్టుండారు...మా నాయ్న చనిపోకముందు ‥ సారాయి డిపో లేదా దాంట్లోన ఉండె అనమాట, బట్టిసరాయము అని అమ్ముతరు అన్నమాట. అది అంటె నాటుసరాయి. అది బట్టి సరాయి అమ్ముతరంట అక్కడ అటుసైదు, వాల్లంత కొంత మంది కల్సిపొయ్యి అక్కడ పోతారన్న మాట. పొయ్యి ఆడ ఎవురెవరు సరాయి చేస్తుంటారో వాల్లందర్నీ పట్టుకోనొస్తారన్నమాట ఈటికి. పట్టుకోనొచ్చి అది, ఆదని చేస్తుండన్నమాట. అంతకుముందు నుంచి తాగ తాగేది అలవాట్చేసుకున్నాడన్నమాట. మానాయ్న దాంట్లోనుంచి అపుడు రోజు పదిరూపాయల్ ఇస్తుండ్రిడి మానాయన్ని...మూసి నాను. అది బెల్లమని సరాయిబెల్లమని స్పెషేట్టుంటది. అసలు అది వాసనే ఒకరకంగా ఉంటది. నల్లగ ఉంటది బెల్లము. ఆ బెల్లంతోని ఏసి దాన్ని ఏసి ఉడకబెట్టరు బాగ. దండిగ నీల్లేసి కుండనిండ మామూల్ కుండ తీస్కుంటరు. ఇంత పెద్దది దాన్నిండ నీల్లేసి ఉడక బెట్టరు. ఉడకబెట్టిన్ తర్వాత, అది ఒక సమ్మ చెక్కని ఉంది. ఇంత చెక్క, ఆ చెట్టుచెక్క నరుక్కొనొచ్చి దాంట్లో ఏస్తారు. దాంట్లో ఏసి ఉడికింతర్వాత మరి ఇంకో పెద్దది బాన తీస్కొని, కుండ అట్లాడ్డి తీస్కొని దానికి ఒక్కోట్టి పదపోస్తారు. దాంట్లోకి వడపోసి పైన పడిందంతా ఒండుగిండు అంతా పక్కకుతీసి పడేస్తారు. మామూల్ మిగిలిందంతా...సారాయి అమ్ముతారన్నమాట దాన్ని. అట్ల తయారు చేస్తారు.... దాన్ని ఏమిలేదు. ఒక్కరోజంతా ఉడకబెట్టరు బాగ (ఒక్కరోజు) కంప్లీట్. ఒక్కరోజు ఆ చెక్క, ఆ అయింతర్వాత బెల్లము, అంతా ఉడికేంతవరకు అట్లనే ఉడకబెట్టి, తిరగరోజుకల్లా మామూల్గ చేసేస్తారు పదపోసి సారాయి చేస్తారన్నమాట.

...ఇపుడు నా సమస్య కొన్నే మాత్రం నేను, సెపన్తె నేను ఎట్ల రాసైనో నాకే

తెల్దు. పరీక్షలేమి అది ఎట్లరాసినానో. ఎయ్త్ నించి మాత్రం కష్టపడి చదువ్కుంటా వస్సుండాను. టెన్త్‌లోనగుడ సెకండ్‌క్లాస్ వస్తాదనుకుంటిసికాని రాలేదు. రెండొండలఎనబై రెండు వచ్చినాయి, మార్కుల్‌నాకి టెన్త్‌క్లాస్‌లోన. ఇపుడు ఇంటర్‌లో ఇంకా కష్టపడి చదువుతున్నాను. ఇపుడు కేమో బాగ కష్టపడుతున్నాను. ఇన్ని టెస్టులు అవిట్లోమార్కులు బాగనే వస్సున్నాయి. ఇంగ్లీస్ అంటే కొద్దిగ ఎక్కువ ఇష్టం పడతాను. బాగ చదువ్‌కోవాలని అబిలాష. అది చదువ్‌కుంటు పోతున్నాను. ...ఇంటర్ అయిపోయిన తర్వాత ఆలూర్‌కి డిగ్రీ కాలేజి వస్తాదంట. ఒస్తే ఈడ చేరేది లేదంటే ఒకేల క్లాస్ ఒస్తే . సిల్వర్ జుబ్లీ పొయ్యి ఎంట్రన్స్ రాసి అక్కడే చేరాలనుకున్నాను. ఇపుడు డిగ్రీ రాలేక పోతే ఆడ చేర్తాను. డిగ్రీఒస్తే ఇంగ ఈడే చేరేది.... ఆడ అయిపోతానే అక్కడే ఉద్యోగం వస్సుందట ఆడ ఉద్యోగమొస్సే, ఇంక అక్కడే చేస్తాను అనె ఒకేల అట్ల లేదంటే ఈడొచ్చి అట్నుంచి ఇక్కడొచ్చి ఇక్కడ ఎట్ల రేడియో షాపులు అవిలేవు, మెకానిక్ చేసేకి. ఈడొచ్చినంక చెయ్యొచ్చు ఒకేల అని అతనే అంటాడన్నమాట.

...అప్పుడు స్ట్రైక్‌లంటే ఎయ్త్‌నించి నాకు బాగ గుర్తుంది స్ట్రైకులు చేసి నేటిది. ఎయ్త్‌లోన వచ్చేసి లాజిక్ లక్చరర్ లేడనేసి అప్పుడు వాల్లు స్ట్రైక్ చేసినారన్న మాట. ఈడ ఐస్కూల్ సెక్షన్ కాలేజీ సెక్షన్ రెండు ఉంటాయ్‌గదా. దానికి దీనికి సమందం లేదని మా ఐస్కూల్ టీచర్లు అప్పుడు చెప్పినాగుడ వాల్లు ఇన్లేదు. కాలేజోల్లు మమ్మల్ని గుడ బయ్‌టికి తీస్కొని పొయ్యారన్నమాట. మాకొద్దప్పా అంటే గుడ అట్లె తీస్కొన్ పొయ్యారు బయ్‌టికి. చెయ్యాల మీరుగుడ అని. వాల్లు ఎట్ల చేస్సారో స్ట్రైకు వాల్లకే తెలీదు. అట్లచేస్సారన్నమాట అసలు. కాలేజిలోన అప్పటికి మాత్రం ఎయిత్ క్లాసులో ఉన్నా, ఊరెమ్మడ్తోబడివాల్లు ఎవురెవరు అంగడీలు వ్యాపారస్సులు ఉంటారో వాల్లతోనంతా డబ్బులు వసూల్ చేస్సారు. దాన్‌తర్వాత నీలిరంగులు డబ్బాల్ తెచ్చొని బస్సులిక్కి గోడ్లమీద యాడంటే ఆడ రాసేస్సారు. ఒక ఇర్వైమంది ఒకసాటుంటే ఒక ఇర్వైమంది ఇంకో సాటుంటారు. అసలు వాల్లకి చెప్పేవాల్లు లేకున్నెట్లుంటారనమాట. వాల్లే స్ట్రైకు చేసేవాల్లు అట్ల. ఎయ్త్ క్లాసులో ఉన్నేంగ, మొన్న టెన్త్‌క్లాసులోన జరిగింది. స్ట్రైకు అది వచ్చేసి ఇంగ్లీషు లక్చరర్ లేడని ఇంగ్లీషు లెక్చరర్ అప్పుడు పొయ్యుండె. పొయినాడన్నమాట. అదేమిటికో సంచ్రమైంది పొయ్యి. ఇంగ్లీసు లక్చరర్ లేడని స్ట్రైకు చేసినారు. వాల్లు కాలేజోల్లే, మాకేమి, ఏమిలేదు. కాలేజోల్లే చేస్తే వాల్లు...ప్రిన్స్‌పాల్‌కు చెప్తే ప్రిన్సిపాల్ నేను బోర్డుకు రాసినాను, వాల్లు ఏమి చెప్పలేరు వాల్లు అని చెప్పాడన్న మాట. అప్పుడుగుడ వాల్లు స్ట్రైక్ ఏమి అంతగా పట్టిచ్చుకోలేదు. అసలుచెయ్‌లేదు,సరిగ్గుడ వాల్లిస్టము ఎట్లొస్తే అట్లచేసుకున్నారు స్ట్రైకు. తర్వాత ఇంగ్లీసు లక్చరర్ వచ్చినాడు... పోలీసోల్లు ఎవ్వురు అసలు పట్టిచ్చుకునే వాల్లే ఉంటలేదు అసలు. ఎవుర్ది వాల్లే పోతుండ రన్నమాట. ఒక ఇర్వైమంది గుంపైతే వాల్లెంట పొయ్యేది. అందరూ ఇంక ... ఒక మూన్ద్రోజులు చేసింద్రి. ఏమన్లేదు. వాల్లు వచ్చి కాలేజోల్లు అసలు మేము పంపీయ్యమయ్యా మాకు సంబందం లేదు, మీరు ప్రిన్సిపాల్తోన, ప్రిన్సిపాల్‌నడిగి తీస్కొన్ రాండి పర్మిషను అంటే లేదయ్యా, నాకు చెప్పొద్దు అని క్లాస్ ముందర గలాట్ చేస్సే, ఇంక ఇదేం

జాగ్రదు, పోండప్పా, మీరుగుడ అని పంపించిరి బైటికి. ఇంక రెండోరోజుంటే ముందే గేట్లన్నీ బంద్ చేసి నిలబడ్సిరి. ఎవ్వరు లోపలికి పోవద్దండి అని.

...ఆక్సిడెంట్లంటే, అంత పెద్దవి, ఏమి లేవు. మామూల్ ఊర్కె బస్సు పడిపోడము, బ్రేక్ ఫైయిలై ఇక్కడ బళ్ళారి రోడ్డు సైడు పడిపోయింది. అది మా అవ్వ ఆడ గడ్డి కోస్తుండెన్నమాట. ఆ వంకలోన, గడ్డి కోస్తుంటే ఆడ, మోపు మోస్కోనొస్తాంటే పోతిమన్నమాట గడ్డి మోస్కోనొచ్చేకి, గెడ్డి మోపు కడ్తుండే, ఆడరోలర్ అడ్డం నిలబెట్నేరు రోడ్డుకిట్ల, పూర్తిగ అడ్డం నిలబెట్నేరు రోడ్డుకి. రోడ్డుమీద అర్ధం దాంక అదే ఉండాది రోలర్. వాడిట్ల ఆబస్సు ప్రైవేటు బస్సు ఇట్ల పక్కనుంచి పోవమంటే ఎట్ల స్లిప్పయిందో మరి ఏమో, పడిపోయింది పక్కకి. అద్దాలు అన్నీ పగిలి పొయ్యాయి. మంచి బస్సు, బాగుండె అప్పుడు. బళ్ళారి టు కర్నూలు అది, ఆబస్సు పడిపోయిందన్నమాట. అది చూస్నాను. దెబ్బలు ఎవురికి తగల్లేదు, డ్రైవరుకు మటుకు కొద్దిగ నెత్తికి తగిలింది పైన అంతే. ఇంకెవురికి దెబ్బ తగల్లేదు. అప్పుడు గుంటకల్ రోడ్డుకు గౌర్నమెంటు బస్సుదె అప్పుడు వానికి బ్రేక్ ఫైయిల్ అయిందో ఏమో, బ్రిడ్జి ఉంటే దాని మీద్ నుంచి కిందకు పడి పోయిందన్నమాట. ఒక మన్ని అక్కడక్కడే సచ్చిపాయ్. ఒక ఇద్దరు, ముగ్గుర్కి కాళ్లు ఇరిగిపాయ్. చేయిలు ఇరిగి పొయినోళ్లు తలమీద నుంచి దెబ్బలు తగిలినోళ్లు అప్పుడు ఎవురు చూల్లేదు, ఆలూర్లోగుడ, అంత ఎప్పుడెప్పుడు జరిగుంట్లేదు, ఆలూర్లో అట్లాద్ది. అంతా ఎక్కడ చూసినా రక్తమే. అట్ల జరిగిందన్న మాట అది. అదే చూసింటిని.

...మరి తర్వాత అంటే...ఇప్పుడు ఈడ బస్టాండులోన పొడ్సిందంటే అతన్ని బణిగేరోల్లని, వాళ్లు కోర్టుకొచ్చింటే, ఈడన్నమాట బస్టాండులోనే ఎక్కడ లేదు మళ్ళా. మేము ఇట్ల కాలేజికి వత్తామని పస్తుంటే, ఆడనమాట గొడ్లి తీస్కోని, ఈడ నరికిరి. మెడ మీద నరికిరి పైన. ... ఏమో వాళ్లకేమో, పార్టీలుండాయంట, అంతకు ముందు. ఆపార్టీ లుంటే నరికినారన్నమాట. అతనే అంట వాళ్లకు పెద్ద. అతను గుడ ఇంతకుముందు రెండు మూడు కూనీలు చేపిచ్చినాడంట అతను గుడ అది.

అదొకటి అయింతర్వాత నేను సెవన్త్ చదివేతప్పుడు ఈడ ఇక్కడే, దీన్లో ఈడ ఐస్క్రీమ్ ఫ్యాక్టరీ లేద, ఆడ ఆడైతే...రెడ్డి అని అతన్ని చంపిడ్సిరన్నమాట, అతన్నిగుడ, ఈడ అతనిగ్గుడ పార్టీ ఉందంట అల్గేర్లో...రెడ్డని అతను మంచి సౌకారంట బాగ ఉన్నోడు అతనే అనమాట. ఈడ కేసుంటే కోర్టుకొచ్చినాడు ఈడ. ... వొచ్చింటే అతను ఈడ సమ్తి ఆఫీసులోన ఈడ బి. డి. ఒ. ఆఫీసులోన ఆడున్నాడన్నమాట, ఆడుంటే అతను ఎప్పుడు రివాల్వర్...అతన్తోన రివాల్వర్ ఆరోజు లేకుండ వచ్చినాడనమాట అట్లే. ఇక్కడ ఆలూరోళ్లు అతనికి బాగ గుర్తునోళ్లు అడిగినారు. రాప్పా, టీ తాగొస్తామంటే, ఏంతాగొస్తావ్‌లేప్పా పొయిరాపో నువ్వొక్కడే అని పంపించినాడు. ఇంగ ఒక ఎనిమిది మంది ఎనుక నుంచి వచ్చిరి. ఇతను చూల్లేదన్నమాట వాళ్లు వచ్చేది. ఇంగ ఇట్ల ఏమో గుర్తొచ్చి తిరిగి చూసె. ఎన్క తిరిగి చూస్నే, ఎనిమిదిమంది వొస్తుంటే ఇంక పరుగెత్తేకి పొయ్యాడు, వాళ్లు గుడ పరిగెత్తి, నేను చూడంగ మాత్రం లొడ్డచెయ్యోడు కత్తి తీస్కోని ఇట్ల ఏసిడ్సినాడు. ఇక్కడ కొంకిట్కు పడింది.

కరెక్టు, ఈడ కొంకెయ్కి పత్తనే' అతను ముందర్కి వస్తాడు అట్లే, ఇంగొచ్చి ఒక్టాం తిస్కోని పొడ్సినారు, ఈపెన్కి అట్లే, నాల్గైదు సార్లు ఇక్కడ పొడ్సిరి. ఇంక అంతా మాసు, అంతా సెవన్త్ చదివోళ్లు ఎల్లిపొయి చూస్తే, ఇంతింత లావు గుండ్రాళ్లు తీస్కోని మామిందికి ఏసిరి. ఇంగ పరిగెత్తితిమి అట్నుంచి ఇక్కడికి వచ్చేదాంక. ఇంగెప్పుడు... పట్టిచ్చుకోలేదు ఉపుడు...తర్వాత వచ్చిరి పోలీసులు...ఇట్ల ఎల్గొండ రాయని గుడి అని ఇట్ల దాని చేస్తమీద పడి పొయిడ్సిరి. అట్టే ... ఏం చెయ్యలేము. తర్వాత ఇంగ మామూల్గా అది సల్లబడ్డ దినాల్కి వొరాల వాళ్లు వచ్చి వాళ్లే ఈడే జైల్లో ఉండ్రి. మరి కేసు గెల్సి వాళ్లే పొయిడ్సిరి మళ్లీ.

...ఉపుడు గెల్సినాము. మొన్న టెన్త్‌లోన ఐతే హాలీకి పొయినప్పుడు మా హైస్కూల్ సెక్షన్‌కి జోనల్ ప్రైజస్‌కి పొయినప్పుడు ఐతే కబడి గెల్సిలేము. కోరన్నర్స్ వచ్చిందన్నమాట. తర్వాత ఆలినుంచి వచ్చిం తర్వాత డోన్‌కు పొతిమన్నమాట. డోన్‌కు పొయ్యి ఒక టీముతో గెలిస్నిమి. ఇంకో టీముతో ఓడిపోతిమి. ఇంక అడ ఏమి సర్టిఫికెటు రాలేదు. అది డిస్ట్రిక్ జరిపిందంట. డోన్‌లోన, ఆడమాత్రము సెలక్టయితినేను, కో... జాగాడ్తాను. తొమ్మిదిమంది కోప్లేర్స్. దానికి వచ్చేసి టైమ్ ఏడేడు నిమ్షాలు పెట్తారన్న మాట టైం. ఇపుడు సీనియర్స్‌కి, ఏడేడు నిమ్షాలు పెట్తారు. జూనియర్స్‌కి ఐదైదు నిమ్షాలు పెట్తారన్నమాట...ఏడ్ నిమ్షాల్లో కొట్టాల వాళ్లని. ఎంత, ఎంతమందిని ఔట్ చేస్నే అంతమందిని ఏడ్ నిమ్షాల్లో ఔట్ చెయ్యొచ్చు. అట్ల ఔట్ చెయ్యకుండగ ఫస్టుటైంలోనే మిగ్గుంటారన్నమాట. బాగ ఆడేవోళ్లు, ఆళ్లు ఏడ్‌నిమ్షాలు మొత్తము వాళ్లు మిగ్రే ఆడుతున్నారు అట్ల ఉంటదంట టైమ్‌కి. సెకండ్ టైము అంతకంటే కొద్దిగ తక్కువ అత్తగ ఉంటదన్నమాట. సెకండ్‌టైము వాళ్లు గుడ అట్ల ఆడ్తారనమాట, వాళ్లుగుడ టైమ్ అడ్జస్ట్ చేసి, ఇంక థర్డ్ టైమంటే మామూల్గుంటది. కోలోన వచ్చేసి ఛేజింగు, రన్నింగు అని రెండుంటాయి. చేజింగంటే కూసునేవాళ్లన్నమాట. రన్నింగంటే పరిగెత్తోల్లు ఉంటారన్న మాట. దాంట్లోనే ఇపుడు చేజింగు ఒకసారి చేస్నాము. మరి తర్వాత వాళ్లు చేజింగ్ చేసి నోళ్లు రన్నింగు చెయ్యాలనమాట. మరి ఇంకోసారి వాళ్లు చేజింగ్ చేస్నారు. ఏళ్లురన్నింగ్ చేస్నారన్నమాట. రెండ్ రెండ్ సార్లు చెయ్యాల. రెండుసార్లు చేజింగ్ రెండుసార్లు రన్నింగ్. రెండు విన్నింగులు ఆడ్తారనమాట దాన్నికో....

హాలిలోన వచ్చేసి ఎమ్మనూరికి, ఫస్టు విన్నింగ్ ఎనిమిది కొట్నేము. వాళ్లు నల్గుర్ని కొట్నేరు. ఫస్టువిన్నింగ్, సెకండ్ విన్నింగ్ మేము ఐదుమందని కొస్తే వాళ్లు ఇద్దర్ని కొట్నేరు. అదె తర్వాత మరి మాకే పడిందనమాట. ఆలూర్కి, ఆలూర్కి, అడ జి. బి. ఎచ్చేస్సు అయిం తర్వాత కాలేజి. మాకిమాకే పడింది. అది జి. బి ఎచ్చేస్ బాగుం దన్నమాట టీము. కోగాని అప్పుడే అది ఒకసారి డిస్టిక్ సెలక్టయ్యిందెనమాట కో టీము మొత్తము. డిస్టిక్‌లో విన్నర్స్ అయి వచ్చిండ్రోళ్లు. దాన్తోన ఆడ్తిమనమాట. ఐతే వాళ్లకి, మాకి రెండేరెండుపాయింట్లలో ఓడిపోతిమి. ఇంక ఆట్నించి వచ్చినాం. దాన్తోన అట్టే పొతిమి. ఇంక క్రికెట్ అంటే ఇకడెక్కడ జోనల్స్‌కేం పోలేదు నేను. ఔటన్స్‌తో మాత్రం పొయ్యాను. హాలగుంద, ఆదోని, పత్తికొండ, డోన్‌ఇట్ల ఓటీల్తోమాత్రమే ఆడ్నేను. నాది బ్యాటింగ్ ఏమి అంతగ లేదు గాని, బౌలింగ్‌మాత్రం బాగా చేస్నాను.

బాగ చెప్తారప్పా, కావాలంటే ఇను నువ్వు, ఇపుడు మామెంత బాద పడ్తామో సూడి, అని మాట్లాడ్తారు. ఇపుడు డిగ్రీ చేస్తుండారు, సిల్వర్ జుబ్లీకి పొయ్యారు. తర్వాతఅనంతపూర్‌లోను, గుంటకల్‌లోను, ఆదోనిలోను చేస్తుండారు.

# వ్యవహర్త-3

కేంద్రం : కోయిలకుంట్ల
కులం : హరిజన
చదువు : లేదు

వృత్తి : హాస్టల్ పంటమనిషి
వయస్సు : 50 సం॥
విషయం : పొలం పనులు, పెండ్లిండ్ల గురించి

...ఇద్దరు కొడుకులు...వాళ్లా పన్చేస్తాండారు...ఉద్యోగస్తులు...వాయ్న, ఒకొయ్న ఐద్రాబాద్‌లో ఉండాడు...అయ్న ఆపీసర్...బిడ్డల్లేరు...పొద్దన్నే పొయ్యి కల్లు తియ్య పోతా...అరగంటక్కు లేసి కసువుల్ నూక్కోని, అన్నం చేస్కోని, కాళ్లు మొకం కడుక్కోని, బాగ సుద్దిగా...పొయ్యి పనికి పోతాం కూలికి చేలల్లకి ఇంగ మల్లా పుద్దైన మొచ్చాము . సొప్పకంకులు అన్ని గోచ్చాం.

.. ఐదు గంటలవరకు సొప్ప గోసెవి. మేమే అన్నం గొంచక పోతాము, పన్చేసి, పైకేల అన్నం తిని, మల్లా ఐదు గంటల దాకా ఇడ్సేదు. ఇడ్సేక ఇంగొచ్చి మల్లా ఇంటికొచ్చి ఇంత అన్నం గిన్నం, చేస్కోని ఇంగ పండుకుంటాం అంతే. ఇంగ దినాం ఆ పనే ఇంగ కూలి పనోల్లం...మూడు సోల్లు, ఒకొక్క నాడు రెండు పల్లు అట్ల ఇస్తారు .. తొలింగ బాచ్చారు కొయ్యాలు. కొయ్యాలు బాసి దుక్కి దున్ని...బుడ్డల్కు దుక్కి దున్తారు. దుక్కి దున్నేక వాన గిన పడ్తే ఎదువందు జల్లి, ..మల్లా పాసి వానగుర్సినాక బుడ్డ లేచ్చారు. ఏసి, ఇంగిత్తనమేసి, మల్లా కల్పుల్ దిచ్చారు. మొల్చినాక, కల్పుల్ దీసినాక ఇంగమల్లా ఇంత పూత గీత కాసినాక వానదేవుడు గురిచ్చే, ఇంగ అప్పుడు దేవుడా అని, అంత బుడ్డ గిడ్డ ఎల్లుతాది. మల్లా బుడ్డల్ గొయ్య పోతాంటాం. మల్లా కొన్రోజులకు అదే కాసినాక ఇంగ ఆ పనే చేస్కుంటాంటాంనాయ్నా...ఎవుల్లకంటే వాల్లకు బోతాంటాం... ఎవుల్ బిలిచ్చే వాల్లకు పొద్దనలేసి మాకు రామ్మా, మాకు రామ్మా అంటారు. ఆపనికి బోతాంటాం పొలం లేదు నాయ్నా. ఊర్కే కష్టమే. కట్టానికే పోతాం...కట్టాలుంటాయి. పనికి పొయ్యి అన్నం దెచ్చుకొని, గింజెలు ఎయిచ్చుకొచ్చుకుంటాం, రైతులంచన. ఎచ్చేచ్ కొచ్‌కోని అన్నము వొండుకుంటాం. మల్లా పనికి పోతాంటాం ఇంగ అంతే ఆ కష్టమే. ఇంగేం కట్టం లేదు. పొలం లేదు గిలం లేదు. ఇంట్లో కట్టం. ఇంగ అన్నం చేస్కోడం తినడం. ఇంత సద్ది అన్నం కట్కోడం మల్లా పొలం పోతాండడం. ఇంగ అంతే లండ్రి. ఇంగేం పన్లేవు. ఇట్ల కట్ల పడ్తాండాం ఓ కట్టమే, కష్టంలోనే పనికిపొయ్యి ఇంత మిగిలిచ్చుకోని, అట్టనే ఎక్కిపొయ్ సదివినాడు. ఎక్కిపొయ్ పనొచ్చింది...పోతాం ఎప్పుడన్నా పొయ్ మల్లా కొన్రోజులుండి మల్లా ద...ఏమి, అక్కడ బస్సులు మచ్చుగా, ఆటలు, ఏంటివేంటివో నానాకంయి ఉంటాయి. తిక్కలేసి నట్టుంటి, ఆ ఊర్లో ఉండబుద్దిగాదు. ఇదో మా పల్లెటూల్లో ఉండి, ఉండమన్నే ఉండబుద్దిగాదు. ఇంగ అవెన్ని ఉండలేక ఇంగ ఇక్కడొచ్చినాం అంతే . మూన్నెల్లున్నే, ఒక్కపారి మూన్నెల్లుండి, ఒకపారి రొన్నెల్లు. బిడ్డి పుట్నెప్పుడు పొయ్యి, మల్లొచ్చాంటాం...మాకొల్లి అందు అక్కన్నే ఉండారు...లేరు, ఇదో ఈ పిల్లోడు మనవడు. ఈ రెండొటాయన కొడుకు. ఆ అక్కయ్య

పోయేడు. వాళ్లకు పిల్లల్లేరు, ఇంగా...అప్పుడు మచ్చుగా పైరు పండుతాండె. వాన గురుచ్చాండె. ఇప్పుడు వానల్లేక దేశమంతా ఉడుక్కుతాంది నాయ్నా, కరువొచ్చింది. బువ్వల్లేక సేసమంది అల్లాడిపోతాంవారు. వాన దేవుడో అని నీళ్లు బుట్టక సగర పొద్దున నిద్దర్లేక దెకో అని అల్లాడి పోతాంవాం తండ్రి ఇంగ అంతేను మా కష్టమొచ్చింది. ఆ యాలక మచ్చుగ పైర్లు పండుతాండె. ఈ పంటలు ఎక్కువైనాక ఒక పైరైన ఏమి సరింగ పండు తాంది, పండక అప్పుడు ఉత్త ఎరువు దోలి నెలకు రెండు వర్సాలు, మూడు వర్సాలు కురుచ్చాండె మచ్చుగా ఇంతింతలావు కంకెపండి బుడ్డలు ఇన్నిన్ని కాసి, పది డబ్బాలు అట్ట కోచ్చాంటిమి. ఇప్పుడు ఇంతింత డబ్బాలు పెట్కోని, పెద్ద పెద్ద డబ్బాలు పెట్కున్నేరు ఆ డబ్బాలు వన్నేం ముంచి పైరు పండక సచ్చి పోతాంవాం. ఇంగ అంతేకదు అట్ట రైతులకు గడ్డు అన్నే నేను ఐదారు మాట్లు. ఇంతింత డబ్బాలు పొద్దు సూకులు గొయ్యి డబ్బాకు గోస్కోలేం. రెండున్నర, మూడున్నర ఇచ్చే ఏమొచ్చాది దానికి, అప్పుడు డబ్బాకు పడిగింజెలు ఏచ్చాండ్రి. ఆకాలంలో మాకాలంలో అట్టాటికాలంలో పదిడబ్బాలు గోచ్చాంటి. చెట్టుకు ఇన్నిన్ని కాయలు తెల్లగ ఇంతింత పొడుగు. ఇప్పుడు బుడ్డ లేదు. కాయసీకి జూడుపో పొలం దెకో అని అంటాడు. అట్టాటి సంసారం చేసినాం నాయ్నా. అది పెద్దల కాలం మాట. మచ్చుగా పైరు పండేటాండె బుడ్డల్ దింటాంటిమి. ఇప్పి దెచ్చ కుంటాన్నే ఏం అనకుండాండ్రి.

...మోటోళ్లతో మాట్లాడేది పోనాయ్నా. సదువు, సదువు అంటే యాడ సదువు లంటాడు. ఆకట్టం చేస్కోని సోలడు గింజలుగాని బతుకుతాంటిమి. ఇప్పుడు పిల్లలు సదవక, ఇట్ల పోతాండాం నాయ్నా పిల్లోడు కాలు బంగమైంది. పోలియో వచ్చింది నాయ్నా. ఈటికిరా...పోలియోవచ్చి ఆక్కడ ఓరంగల్లుకు పొయ్యి కాలుకు ఆపసన్ చేయిచ్చి, ఏడునెలల్లో వొచ్చింది నాయ్నా. ఉన్నే దుడ్లల్లా కట్టంజేసిన దుడ్లల్లా వానికిబెట్టి ...ఐదారేలయింది. సన్నప్పనుంటి, సూదులు మందులు ఈడుచ్చాండె మొన్న ఆపసన్ చెయిచ్చుకొచ్చినాం. మల్లా ఓరంగలుకు పొయ్యి చెయిచ్చి కొచ్చినాము అప్పుడు డబ్బు కర్జయి పోయింది...ఇంగేంది. మాకొచ్చినట్టుతే. మేం మోటోళ్లంతే. ఓరంగల్లుకు పొయ్యి కాలు రోత నడుచ్చాంవాడు. బడికి పోనాయ్నా అంటే పాడుసూడి మల్లా. ఇట్టాటి మాట లన్నా నేర్చుకుంటావ్ గదూ నువ్వు అయ్యమాట ఇని బడికి పోనాయ్నా.

...పెండ్లికొడుకోళ్లే ఇచ్చాండ్రి. ఏవో పెండ్లి కూతుర్ని దోలకొచ్చేది ఇప్పుడు ఆపెండ్లి కొడుకును పెండ్లికూతురు జూసేలేకి దాగ ముప్పై మూర్లది, ఇరవై మూర్లది చీరె కోరవాకు తీసేది పసుపు అద్ది, పెండ్లికొడుకును, పెండ్లికూతుర్ని జేస్నే సింగారంగా ఉంటాండిరి. ఇప్పుడు ఇంగ పెండ్లికొడుకొచ్చేలేకి కులుకుతుండాలె పెండ్లికూతురు. వచ్చాం దాదమ్మా పెండ్లికొడుకు...సూన్నీకి అంటే కులుకుతుండాలె ఉండొద్దు...ఇంగ మల్లా రింగేయ్యాలె. మాకు పెద్దలకాలం యాడ్దినాయ్నా. ఏంవో సూచకం గట్టి పెండ్లికొడు కొచ్చాంటే, అమ్మా ఎవురోనే అని అట్ట ఉరుకుతాంటిమి అప్పుడు తెలియక. ఇప్పుడు ఇంగ పెండ్లికొడుకొచ్చేలేకి సోకు ఒవాలె. ఇంగ ఆమె జడ ఏయ్యాల పూలు కెట్టాలె, ఇంగ వచ్చాండాదమ్మా పెండ్లి సూపల్కు, సీరె ఇడిపిచ్చేద, ఇంగ ఆమె ... నెత్తిదువ్వి ఇంగ ఇద్దరు ప్రేమించాలె ఇంగ ఇవన్నీ పెండ్లింట్లు ఇట్ట జరుగుతుంవాయి. ఇంగ వానలు

ఇంగ దేవున్ని లోపల్కేసేది, ఇంగ ఏమన్కేడ . . యాడాడికి సముద్రానికి ...... ఏం జరగదు. ఊర్కే టెంకాయలు కొట్తాంటారు. సెనివారం, సెనేరం తప్పట్లు మేలాలు పొయ్యేది దేవున్కి పొద్దసటుక్కె పూజం పెట్తాందారు. పొదన పెట్తారు సాయింత్రం పెట్తారు పూజ తగిలిచ్చారు. పెటేటికి తియ్యారు. యాడాదికి దీచ్చారు. తిర్నాలని యండల్ కాలం అప్పుడు తీచ్చారు... త్రే,త్రే ఎద్దుల్ గిద్దుల్ర్తే ఆయనే రంగసామికే చేసేది మేము. దాగ ఇండ్లు పూస్కుంటాము, బియ్యం బేల్లు ఇచ్చొచ్చి మల్లా అక్కడ సోడు దిన్నోకి తీస్కె పోతారు సామిని. ఆపొద్దు తీస్సారు పెటేటికి ఆరంగసామిని. ఆరంగసామిని దీచ్చే ఇంగ అప్పుడు పొయ్యేది ఇంగ అప్పుడు దేవాతనేది మొక్కుండేది. టెంకాయ కాయ కప్పురం ఇచ్చొచ్చేది, ఇంట్లో తలియ ఏస్కుండేది మల్లా ఇంత పండగ చేసేది, మల్లా మర్సనాడు పనికిపోలాం. ఇంగ అంతే . . . మేం ఒక్చేల్నా పాయసమన్నా ఏదో ఇంట్లో ఉగితి ఉన్నేకాడికి చేసుకుండేది . . . ఏమో. పండగని ఎవురిమైనా చేస్కేము. చేస్కుం డేది చెప్తాండా...నేనెంతసేపు మాట్లాడ్దు అమ్మో ఎట్టనే వాల్లు మాట్లాడని... మేం మాంసం .. దింటాము. కోల్లను తింటాము. వారం వారం తెచ్కుంటాం తింటాటాం...ఎత్కొచ్చేది, కోసేది, దాగ నీల్లుపోసి దాగ కడిగేది. ఉప్పు, కారెం ఏసేది ఉడకబెట్టి ఇన్ని తమేట పండు నానాకవి సొబ్బెర అల్లము ద చేసి దాగ ఉడికినాక దింముకుండేది రొట్టెలు అన్నము పొండుకునేది, పొండుకోని తించే దాగుంటాది. యాటమాంసం లెక్కనే. మా పిల్లోల్లు దినర్లే. మేందింటాం.

...పోతాంటే వాటుబడె . అప్పుడు మా కాలాన. బండి పోతానేది కచ్చిర్కెల్లి పడె. పత్తానే ఐదారుమందికి పండ్లూడిపాయ్ పక్కయన్నీ...కష్టానికి పోతాంటే. ఒకామెకాడ పొయ్‌లో ఆడ మంటబెట్టి సేలల్లో ఇంత సెత్తేసి మందేసి అందర్కి ఉడుకులు కాప్తి. ఉడుకులు గాపినాక ఇంగ అంతాబాయ మల్లా కంకులు గోచ్చిమి. ఆటికి అట్ల జరిగిండె ఆ పొద్దు...పాముల్ కరిసేది అందుచూల్లే, ఇంగా పాము లంచే ఉరుకుతాం...

ఏమో రాస్కోని పోతారు. యాడ ఇచ్చాండారు ఇయ్యర్తె. ఏందో మైకలొచ్చా యని రాస్కుంటాంతాము ఏదన్నా కాయితం పెత్తే వచ్చాదని రాస్కుంటాంటే ఏది, ఇచ్చి నోల్లకు ఇచ్చాండారు, అక్కటోల్లకు మాకు ఇ్రే ల్లస్తలాలు వొచ్చినోల్లకు వొచ్చి నాయి. మాకు రాలేదబ్బా. ఏమో రాత్రే మేం పెట్కోలే. యాల ఎవుదేస్కుంటాడని, యాల రావని ఏం బెట్కోలే. సాల్లే ఇంత గుడిసెల్లోనే ఉంబొచ్చు మా జీవనం పోతాది. ఏమి మనకేం వాల్లు, ఈల్లు సిలాకాలం బతుకుదామా అని పెట్కోలే. పెట్కోని ఆడ ఎయ్యోద్దూ ఇండ్లు...ఇంగ యంబడే ఎయ్యాల నంట యంబడే ఏచ్చేనే అంట ఇచ్చేది. వాల్లేమో అంతో ఇంత ఇచ్చారంట, ఇంగఎప్పకుంటే మల్లావాపసు పోతాదంట. ఈ జాద ఎంచుకని...యాడ ఇంగ ఆడ కొట్టము ఏసే రేకి ఐదాడు నూర్లు కావాలె...ఇదో ఈ కొట్టంలో ఒకల్లు, ఆ కొట్లంలో ఒకల్లు ఉంటారు...కట్కుంటాం. వాల్లే ఇంత చెరింత సాయం చేస్కుంటే కిట్కుంటాం.

...ఆస్టల్లో అన్నం వండను పోతా. ...పొద్దనే ఆరుగంటలకు పోతా, వాల్లు పరీచ్చలకు పొయ్యాలకి ఏదో ఇంత బొరుగులో గిరుగుల్ దెచ్చి, ఆ బొరుగులో ఇంత ఉప్పమో లేకుంచే రొట్టో బీదపిల్లలు గదూ వొండిచ్చే తిని పరీచ్చకు పోతారు. మల్లా అన్నం

పప్పు చెరు చేసి వచ్చా...ముప్పైమంది ఉండారు...ఇచ్చారు నూర్రూపాయలు ..ఇదో ఇప్పుడు దసెరాకే పెట్కోవాల్సింది. వాళ్లే ఇచ్చారు. ఆపనికి సెలువే లేదు గదూ. నే నుంటే వచ్చుండరూ...ల్తే, లేదు. వాల్లే వొండుక్కుంటారు ఒక్కొక్కనాడు. ఇంగ వేరే వాల్లను ఎవుల్లను దోల్కరారు...అన్నే ఇంట్లో చదువుకుంటాంటారు. సమక్కోని మల్లా పరిచల్కుపోతారు. . అక్కడ కడపంట. కడపకెల్లంట. వాయ్న అన్నీ ఇచ్చి పోతాడు బత్తెం తెచ్చేచ్చాడు. ఒకడు లీడరు వుంటాడు ఆ పిల్లోడు ఇచ్చాంటాడు లూంచి. ఇచ్చే ఇంగ వసము వాల్లకు తగినట్టే వొండేసి, దోవ బట్కోని వచ్చాండేది. ఇంగ అంతే... ఏడేంల్లాల్.. యాడ్డీ అరవై ఇచ్చిరి. అట్టనే నూరు మంది ఎక్కోకొద్దీ. అప్పుడు ఎంతమందితే పదైదు మంది పదారు మంది ఉండిరి. పిల్లలెక్కోకొద్దీ నూరు, నూటముప్పై ఎక్కుతాండ్రై.

...ఉండాయంట, ఉండిపట్టి, ఒగే నాకు సీయల్ దైరా ఒక కొత్త సీరై దైరా, కొత్త రైక రైకల్ దొడుక్కోను, కోకల్ గట్టుకోను. నాకు ఎన్నడు పట్టలేబ్బా. ఒక దెయ్యం కన్పల్లే. నాకు దెయ్మే బట్టదు. ఇప్పుడు పట్తాండ్లై, ఎంటికల్ ఇరవోస్కుండేది, ఒరేయ్ నాకు చియ్యాలు...బువ్వ పెట్రా అని కోరేది...మచ్చుగా జరుగుతాండాయ్. ఉరుకు తారు ఇక్కడ రోడ్డంబడి ఎంటికల్ ఇరబోసుకోని చైట, పొరక తీస్కుండేద ఉర్కుతారు. ...ఏందో ఈడ ముడేసేది, మంత్రకాడుంటాడు, మంత్రకాడు ముడేచ్చే పోయిందమ్మా బాగుండాది అని పట్టెడ గిట్టెడ ఎయిచ్చుకుండేది అట్ట కాలం జేచ్చాంటారు వాల్లు...పోతాయ్... ఉంటాయ్. మెరుచ్చాంటాయ్ పోతాంటే. మేం సీకట్లో పోతాం సూడి ఎక్కనన్నా మేం పనులకు పోతాంటే సీకట్లో బొయ్యి అట్టా, అట్టా, అట్టా మెరుచ్చాంటాయ్. ఓయమ్మ ఏందోనే ఒకోక్టి అదురుపోతాం. మిని కొచ్చాంటాది. కక్కుతాంటాది అయుండాయి. మచ్చ గుండాయ్. పొలంలో నేన్ చూసినా మీద్కెమో రావు అక్కడ మెరుచ్చాంటాయ్, ఆ దెయ్యపు కండ్ల దాన్లకు మిని కొచ్చాయంట. నాకేం రాలై నాయ్నా. అట్ట పక్కన బోతాంటే ఊర్కే దీపా ల్లెక్క మెర్సడము.

...మా బావ కొడుకు ఉండాడు సదివిచ్చినాం. ఆ పిల్లోన్కి అపసన్ చెయిచ్చి, అన్నే మూన్నెల్లుంటిమి...ఆల్లు ఈ మాటలు మాకోల్లి అందు వచ్చింటే మాటం ఇట్టనే ఎక్కిచ్చుకుండ్రి.

# 6

# మాండలిక పద (బంధ) పట్టిక

| | |
|---|---|
| అంగడి | కొట్టు, దుకాణం |
| అంగి | చొక్కా |
| అంగె | వృద్ధ స్త్రీలను పిలిచేపదం |
| అంబలిపొద్దు | మధ్యాహ్న భోజనసమయం (కూలివాండ్లకు) |
| అంటుకునె | కోపపడినాడు |
| అయ్‌వారు | పంతులు |
| అరబత్తు | గప్పాలాట |
| అటికె | పప్పుచేసుకొనేకుండ |
| అలిసెందులు | అలసందలు |
| అవిటికి | వాటికి |
| అవుతుకాన | నీళ్ళతొట్టి |
| అగ్గవ | చౌక |
| అట్టబండ | అటక |
| అన్చుకార | సాయంకాలం |
| అత్తీగా | తేలికగా |
| -అక /-ఆంక /-ఎంక | తర్వాత<br>ఉదా॥ పొయినాక<br>చేసినాంక |
| ఆట | సినిమా |
| ఆదరబాదరా | తొందర తొందరగా |
| ఆనకాపు/కాగు | నీళ్ళకాచు పెద్దకుండ |
| ఆమాయన | తర్వాత |
| ఆగింత | అదెంతా |
| ఆరిద్దెల కార్తె | ఆరుద్రకార్తె |
| ఇరకాటం | ఇరుకు |
| ఇపిరి | అతి |
| ఇలే (య్) | ఒరే (య్) |
| ఇగ్గు | లాగు |

| | |
|---|---|
| ఇయ్యాలప్పుడు | ఈవేళప్పుడు |
| ఇర్స | రెండుకుంచాలు |
| ఇచ్చిలేడు | ఇప్పచేపు |
| ఇద్దుము | రెండుతూములు (ధాన్యం కొలత) |
| ఇర్సెడు | పదహారుపళ్ళు |
| ఇస్పేటాకులు | పేకముక్కలు |
| ఈనడమ | ఈమధ్య |
| ఈలకత్తి | కత్తిపీట |
| ఈరియా | యూరియా |
| ఉరుకు | పరిగెత్తు |
| ఉదిరిపోయినాయి | రాలిపోయినాయి |
| ఉత్తబిత్తలై | దిశమొల (దిగంబరం) |
| ఉద్దర | అప్పు |
| ఉల్లిగడ్డ | నీరుల్లి |
| ఉర్లగడ్డలు | బంగాళాదుంపలు |
| ఉస్కె | ఇసుక |
| ఊరివిండి | పచ్చడి |
| ఊసిపోతాయి | ఊడిపోతాయి |
| ఊకే | ఊరకనే |
| ఎంటమ్మిడే | వెంట (నే) |
| ఎగహొర్సి | ఉన్నదిలేనిది కల్పించిచెప్పి |
| ఎనపగొడ్లు | బర్రెలు |
| ఎడిగల | వేసుగా |
| ఎమర్మల్లె | తిరగబడు |
| ఎసుర్లయాలపొద్దు | సాయంత్రం (4-30 - 5గం) సమయం |
| ఎచ్చులు | గొప్పలు |
| ఎన్కసిరి | తర్వాత |
| ఎట్లోకట్ల | ఏదోఒకవిధంగా |
| ఏంది | ఏమి |
| ఏదుము | (ధాన్యం కొలత) |
| ఏల | ఎందుకు |
| ఒల్ల | ఇష్టపడను |
| ఒట్టిగడ్డి | ఎండుగడ్డి |
| ఒట్టిమిర్పకాయలు | ఎండుమిరపకాయలు |
| ఒక్తేల | ఒకవేళ |
| ఓప్పే | తనకంటే చిన్న వయసు ఆడవాళ్ళను పిలిచే పదం |
| కంప | ముండ్లు |

| | |
|---|---|
| కంబాలు | స్థంబాలు |
| కంకెడు | పిడికెడు |
| కన్రా | లోపల |
| కరిరోజు | పండుగ అయిన మరుదినము |
| కరెంటుబుడ్డి | బల్బు |
| కసువు | చెత్త |
| కరంగాయపండు | కరబూజపండు |
| కడ్పమాను | వాకిలికడప |
| కప్పెర | తప్పెల |
| కాడ | దగ్గర |
| కారెం | కారం |
| కాన్ | 1/4 (పావు) |
| కాలమైనాడు | చనిపోయినాడు |
| కాళ్ళ తీపులు | కాళ్ళనొప్పులు |
| కీనాల్ | కాలువ |
| కుంచెడు | ఎనిమిది పళ్ళు |
| కురచ | పొట్టి |
| కుడుములు | ఉండ్రాళ్ళు |
| కువ్వాడం | పరిహాసం, ఎగతాళి (<క. కువ్వాడం) |
| కూసము | (చూ. అంగి) |
| కొంతవో | తీసుకొనిపో |
| కొరిసేవాళ్ళు | చాపలు అల్లేవాళ్ళు |
| కొలుపు | కలుపు |
| కొలువు | ఉద్యోగం |
| కొసువు | చెత్త |
| కొయ్యాకు | తోటకూర |
| కోత్మీర | కొత్తిమీర |
| కోళ్ళ | కోడలు |
| గంటు | మూట |
| గంటె | గరిట |
| గలాబ/గలాట | గోల, గొడవ |
| గవాసి/గవాచ్చి | గవాక్షం |
| గలీజ్ | చెడు (అపభ్రం) |
| గచ్చు | (చూ. అపుతుకాన) |
| గబ్బు | పాడు |
| | ఉదా॥ గబ్బువేసిపోతాది |
| గబ్బునూనె | కిరోసిన్ ఆయిల్ |
| గాజ | గాదె |
| గాను | చక్రము |
| గాసం | జీతం |

| | |
|---|---|
| గాసగాడు | జీతగాడు |
| గిల్లెలుపెట్టి | చాడీలు చెప్పి |
| గుంజు | (చూ. ఇగ్గు) |
| గులిగెలు | మాత్రలు |
| గుడ్క | కూజా |
| గెలం/గెడం | పొలంలో పన్నే పరికరం ఏదైనా |
| గేరి | వీధి |
| గొత్తు | తెల్సు |
| గొడ్లి/గొడ్డేలి | గొడ్డలి |
| గొబ్బరం | ఎరువు, పేడ |
| గొల్వ | గొడవ |
| గోగ్గూర | గోంగూర |
| చంపిడ్సిరి | చంపివేసినారు |
| చిలకం | తిలకం |
| చిత్తి | సంచి |
| చిక్కేలేదు | దొరకదు |
| చీ(గ)పీగలు | దోమలు |
| చెండుపూలు | బంతిపూలు |
| చెనిక్కాయలు | వేరుశనగకాయలు |
| చెలకాల | చెర్నాకోల |
| చెల్ల | ఉత్తరీయం |
| చైతగాదు | చేతకాదు |
| చైనా | చాల |
| చేసిలేదు | చెయ్యలేదు |
| చౌకేకాయలు | గోరుచిక్కుడుకాయలు |
| జంపు | పొడవు |
| జరిగేమోయన | సరిపోయేటన్ని |
| జగ్గి | ఎక్కువ |
| జల్ల | దొల్ల (ఎరువు, ధాన్యం మొ॥వి. తోలటానికిబండి మీదవేసే వెదురు, ఈత పేళ్ళతో అల్లిన గూడువంటి సాధనం) |
| జల్దీ | తొందరగా |
| జాంకులు, జాంకులు | సారి, సారికి |
| జాలాడి | స్నానంచేసేచోటు (స్నానాలగది) |

| | |
|---|---|
| డొల్లగంప | పెద్దగంప |
| డోసులు | జేబులు |
| టపాసులు | ఉప్పాకాయలు |
| టెంకాయ | కొబ్బరికాయ |
| టెక్కు | గర్వం |
| డోని/దోని | మేడకున్న వర్షపునీరు పడేగొట్టం |
| తనలెక్క | తనమాదిరి |
| తపంగావు | పనికిరావు |
| తగిలిన | సోకిన, వచ్చిన (ఉదా॥ కేన్సర్ తగిలిన) |
| తడి | ఒకసారి నీళ్ళు పోయడం |
| తగేవు | కొట్లాట |
| తల్లెలు/తల్లీలు | అన్నంతినే పళ్ళేలు |
| తవ్వెడు | రెండు పళ్ళు (ధాన్యం కొలత) |
| తాండావాళ్ళు | లంబాడీలు |
| తాకిన్రై | తగిలినాయి<br>ఉదా॥ దెబ్బలుతాకిన్రై |
| తుక్క | వైపు |
| తెల్లగడ్డ | వెల్లుల్లి |
| తేనెపెరుతెట్టె | తేనెతెట్టె |
| తొండబిక్కి | తొండ |
| తోల్కొనొచ్చినాడు | పిల్చుకొనివచ్చినాడు |
| దండగ | పనికిరానిది |
| దండిగ | ఎక్కువగా |
| దనేలు | ధనియాలు |
| దబగ్గిన | తొందరగా |
| ద | బొబ్బ |
| దా కల్లా | వాటికంతా |
| దా మీదనే | వాటిమీదనే |
| దాయాదులు | అన్నదమ్ములు/అన్నదమ్ముల బిడ్డలు |
| దీర్పోయింది | (చూ. కాలమైంది) |
| దుడ్డు | డబ్బు |
| దుద్దినాము | తీర్చినాము<br>ఉదా॥ అప్పుదుద్దినాము |
| దూప చల్లారింది | దగ చల్లారింది/<br>నీళ్ళదాహం తీరింది |
| దేవళాలు | దేవాలయాలు |
| దొబ్బు | త్రోయు |
| దోంతర | దోమతెర |
| దోత్రము | పంచ (ధోవతి) |

| | |
|---|---|
| నట్టలు | నులిపురుగులు |
| నగు | నవ్వు |
| నగ్గ | ఎక్కువ |
| నల్తుము | నాలుగు తూములు (ధాన్యం కొలత) |
| నాను | నేను |
| నామందార్లు | శ్రీవైష్ణవుల్లో ఒకతెగ |
| నాగేలి | నాగలి |
| నీరుడు | పోయిన సంవత్సరం |
| నుగ్గికాయలు | మునగకాయలు |
| నెత్తి | తల |
| నేటుమందు | నాటుమందు (గ్రామాల్లో వివరం చెప్పి తెలియకుండా ఉపయోగించే మందు) |
| నేస్తం | స్నేహితం |
| పందుము | పదితూములు |
| పడి | తవ్వెడు |
| పనితెవుల్లు | పని తెగదు |
| పదేదుము | పద్దైదు తూములు |
| పర్నాల | పరాయి |
| పాగడా | పావడా |
| పాపడం | పైరులో గడ్డి, గాదం, కలుపు మొ॥ పోవ టానికి తోలే పరికరం |
| పాలబండ | సల్లికళ్ళపాము |
| పిడత | చిన్నమట్టిపాత్ర |
| పుండుకూర | (చూ. గోగ్గూర) |
| పు చెండు | బంతి |
| పు | ఇరవైతూములు |
| పు దుము | ఇరవై ఐదుతూములు |
| పులగొర్రు | పొలంలోదున్నే సాధనం |
| పెండ | పేడ |
| పెద్దగుర్నాలు | ప్రొద్దుతిరుగుడు పూలు |
| పెదింతమంది | చాలామంది |
| పెదెని | ఎక్కువ, చాలా |
| పోంగ, పోంగ | పోను, పోను |
| పొండు | పండు |
| పొరక | చీపురు |
| పొడికూర | తాలింపు |
| పొద్దుడూకింది | పొద్దుసూకింది (సాయంకాలమైంది) |
| పొద్దుమునుకుటలు | రోజంతా |

| | |
|---|---|
| పొట్టిగాడు | పిల్లవాడు |
| పొయ్‌కాసి | పొయ్యేసి |
| పైట | ఓణి |
| పైతెర్సుకోని | (చూ. ఉత్తబిత్తలై) |
| పైమిందిబట్టె | ఉత్తరీయం |
| | (చూ. చెల్ల) |
| పైటేల | సాయంకాలం |
| బల్‌జెంగస్న/చెడుగుడు | కబడి |
| బరెగొడ్డు | బర్రె |
| బచ్చేలు/బక్ష్యాలు | పోళీలు |
| బల్లెడుకట్టె | పహారీకర్ర |
| బళిగేకోడు | గాజులమ్మేవాడు |
| బానలి | మూకుడు |
| బాత్రె | గంప (యిరువది) |
| బాలేపండు | అరటిపండు |
| బింగ | కంకర |
| బిడ్డ | కూతురు |
| బిడ్డర్ | యాలంపాటపాడేవాడు |
| బుడ్డలు | (చూ. చెనిక్కాయలు) |
| బువ్వ | అన్నం |
| బువ్వతాగినావా | అన్నం తిన్నావా! |
| బుక్కాలు | పుస్తకాలు |
| బుడిగి | ప్యాంటు |
| బుడ్డి | కూజా |
| బుసుకు | చెరుకు |
| బేగి | తొందరగా |
| బేజారు | చిరాకు, విసుగు |
| బొందెలోల్లు | సిక్కులు |
| బొర్ర | రంధ్రం |
| బొర్లు | క్రోసులు |
| మంటినూనె | (చూ. గబ్బునూనె) |
| మండె | తడికెలతో కట్టి ధాన్యం నిల్వఉంచుకునే అమరిక |
| మల్లబడు | తిరుగబడు |
| మర్సరోజు | మరుదినం |
| మతికిలేక | జ్ఞాపకంలేక |
| మజ్జిగతెగులు | పైర్లకు వచ్చే ఒకరకమైన తెగులు |
| మాటిమాటికి | ప్రతిసారి |

| | |
|---|---|
| మస్తుగా/మస్తులుగా | దండిగా |
| మాయన | మోయన<br>ఉదా॥ మూడులుంగీలువచ్చినమాయన |
| మాపిడింతల | సాయంకాలం |
| మాము | మేము |
| మాసులు | ధాన్యం |
| మాట్లు | సార్లు |
| మిల్లి | చెంచా |
| మిచ్చెన | నిచ్చెన |
| మున్గారు (ముంగోరు) | పంటను ఆసామి రెండుభాగాలు, సాగు చేసినరైతుఒకభాగం పంచుకునేపద్ధతి |
| మునిమాపు | సాయంసంధ్యాకాలం |
| ముప్పందుము | ముక్కాలములు |
| ములాజ | ఆస |
| ముత్తుము | |
| ముల్లె | (చూ. గంటు) |
| మెరవని/మెరవణి | ఊరేగింపు |
| మొగదాల | ముందర (మొదట) |
| మోటోళ్లు | మొరటువాళ్ళు<br>(చదువురానివారు) |
| మైకడుక్కో | శరీరం కడుక్కో |
| యాడికి | ఎక్కడికి |
| యాసిరిక | (చూ. బేజారు) |
| రగడ | చూ. గలాబ |
| రచ్చ | చూ. గలాబ |
| రస్తా | దారి |
| రాకతలికె | రాకముందే |
| రామడం | ఉడికినపప్పుమద్దటం |
| రామ్ములగపండు | టమోటా |
| రేత్రి | రాత్రి |
| రేకులకట్టె | (చూ. జల్లెడుకట్టె) |
| రోంత | కొంచెము |
| లాపులు | సత్తువలు |
| లే | లేదు |
| లేకిలేకికూతలు | పెద్దపెద్దమాటలు |
| లేపు | పరుపు |
| లొడ్డచెయ్యి | ఎడమచెయ్యి |
| వచ్చిలేదు | రాలేదు |
| వామె | ఆమె |
| వాయ్న | ఆయన |

| | |
|---|---|
| వాని రెక్కనే | వానిమాదిరే |
| సంకటి | సంగటి |
| సంచెకారం | బయానా |
| సందెకాడ | సాయంత్రం |
| సర్వలు | పాత్రలు |
| సతాయిస్తావు | ఏడిపిస్తావు |
| సల్లాడము | నిక్కరు |
| సగిర పొద్దు/సయిరపొద్దు | అర్ధరాత్రి |
| సన్నిమ్మకాయలు | నిమ్మకాయలు |
| స్వల్పాగ | కొంచెంగా |
| సన్నోళ్ళు | చిన్నవాళ్ళు |
| సాయలేము | చావలేము |
| సిబ్బిరేకు | మూత (పాత్రలపై మూసేది) |
| సీసీకాయలు | చీనీకాయలు |
| సీలుము | సంచి |
| సుడిగాడు | శ్మశానము |
| సొలకాల | (చూ. చెలకాల) |
| సుత్తె | సుత్తి |
| సేద్దెం | సేద్యం |
| సోలిపోయినాడు | ఓడిపోయినాడు |
| షంగమోటు | ఎక్కువ |

